# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు.వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li

https://archive.org

INTERNET ARCHIVE

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Universal access to all knowledge

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements (more)**

Millions of historic images posted to Flickr

Zoia Horn, librarian and activist, dies

Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web 426 billion pages saved over time**

INTERNET ARCHIVE WayBackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** 1,721,625 movies — Browse (by keyword)

Curator's Choice (more)

Noveltoon: The Stupidstitious Cat

A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...

Recent Review

Little Ol Bosko In Bagdad

Average rating:

**Live Music** 131,731 concerts — Browse (by band)

Curator's Choice (more)

Yarn Live at Towne Crier Cafe on 2014-02-16

01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...

Recent Review

Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30

Average rating:

**Audio** 2,095,303 recordings — Browse (by keyword)

Curator's Choice (more)

contra32: Infex - Type-E

How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...

Recent Review

KM/TB Sol Rezza 2014

Average rating:

**Texts** 6,509,320 texts — Browse (by keyword)

Curator's Choice (more)

The Orchid world. A monthly illustrated journal...

No more published

Recent Review

الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم

Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భేతాళ కథలకు పూర్వరంగం

విక్రమార్కుడు ప్రజలు సుఖంగా ఉండేలా పరిపాలన చేస్తున్నాడు. ఒకనాడు - ఒక సన్యాసి అతని వద్దకు వచ్చాడు. రాజు ఆ సన్యాసినెంతో గౌరవించాడు.

అతని వినయవిధేయతలకీ , భక్తి ప్రపత్తులకీ ఆ సన్యాసి ఎంతో సంతోషించి, ఆశీర్వదిస్తూ ఒక పండుని ప్రసాదించాడు. ఐతే.. ఆ పండునేంచేయాలో మాత్రం చెప్పలేదు.

ప్రతిరోజూ ఆ సన్యాసిరావడం... ఒక పండునిచ్చి వెళ్ళిపోడం... విక్రమార్కుడాపండుని దాచమని పక్కనే ఉన్న కోశాధికారికివ్వడమూ. ఇలా జరుగుతూ వస్తూంది.

ఒకరోజు సన్యాసి ఫలమిచ్చేసరికి - విక్రమార్కుడికి సమీపంలో ఒక కోతి ఉంది. అదేమో ఆశగా ఆ పండు వేపే చూస్తుంది. అది గమనించిన రాజపురోహితుడు కోతికందించాడు. కోతి ఆ పండుని తినాలని దానిని కరవగా - పండులోంచి కొన్ని రత్నాలు జలజలమంటూ రాలాయి.

అదిచూసి విక్రమార్కుడు చాలా ఆశ్చర్యపోయి.. అంతవరకూ దాచి ఉంచమన్న పండ్లన్నిటినీ తెప్పించి పగలకొట్టించి చూడగా - వాటన్నిటియందును కూడా అతి విలువయిన రత్నాలున్నాయి. అప్పుడు రాజు ఆ సన్యాసి వేపు తిరిగి - చేతులు జోడించి -

"మహాత్మా! మీరిలాటి ఫలాలను నా కెన్నో దినములనుండి యిచ్చుచున్నారు. ఒక్కొక్క ఫలములోని రత్నాలవిలువా అపారము. నా నుండి మీరేమి ఆశించుచున్నారు? నేను మీకు చేయవలసిన సేవ ఏమి?" అని వినయంగా ప్రశ్నించాడు.

అప్పుడా సన్యాసి - "రాజా! నేను తపస్సుకి సంబంధించిన ఒక మహాకార్యదీక్షను చేయడానికి నిర్ణయించుకున్నాను. అది సక్రమంగా నెరవేరాలంటే నాకు నీవంటి - సాహసమూ, ఔదార్యమూ, విక్రమమూ



చెట్టుపైనున్న భేతాళునికి విక్రమార్కుడు జవాబు చెప్పెను



కలవాని అవసరమెంతో యున్నది. నీ నుండి ఆ సహాయమును కోరుకొనుటకే యిలా చేశాను..." అన్నాడు.

"నేను చేయవలసిన పని ఏమిటి?" అడిగాడు విక్రమాదిత్యుడు.

"రాబోవు - బహుళ పక్షమునాటి - అమావాస్య రాత్రి - నేను తపస్సు చేసే చోటుకి ఆయుధములు మాత్రమే కలిగియుండి ఒంటరిగి రావాలి...

"వచ్చి? " అడిగాడు విక్రమార్కుడు.

"అక్కడికి కొన్ని ఆమడల దూరంలో ఆమడంటే 8మైళ్లు ఒక పెద్ద మఱ్ఱి చెట్టుంటుంది. ఆ మఱ్ఱిచెట్టు కొమ్మకి ఒక శవం వేలాడుతూంటుంది. ఆ శవ శరీరమును నేను తపస్సు చేసే చోటుకి తేవాలి." అన్నాడు సన్యాసి.

"అలాగే" అంగీకరించాడు విక్రమార్కుడు. "మరి.. నేను రావలసిన ప్రదేశం?" అడిగాడు. నేను తపస్సు చేసే స్థలం చేరుకుందుకు గుర్తులు చెబుతాను. జాగ్రత్తగా విని గుర్తుంచుకో" అంటూ ఆ ప్రదేశం చేరడానికి మార్గం గుర్తులూ చెప్పి వెళ్లిపోయాడు సన్యాసి.

బహుళ పక్షము అమావాస్య రానే వచ్చింది. ఆ రాత్రి-

విక్రమార్కుడు కత్తి పట్టుకుని ఒంటరిగా బయలుదేరి - సన్యాసి తపస్సు చేసుకునే స్థలం చేరుకున్నాడు. "ఆ మఱ్ఱిచెట్టు ఎక్కడుందో... నేనేం చెయ్యాలో చెప్పండి" అని అడిగాడు. విక్రమార్కుడిని చూస్తూనే చాలా ఆనందం పొందిన ఆ సన్యాసి - యిలా చెప్పాడు.

"ఇక్కడికి దక్షిణ దిక్కుగా నేను చెప్పిన వటవృక్షముంది. దానికి వేలాడే శవాన్ని నువ్వు యిక్కడికి తేవాలి. శవాన్ని మోసుకు వస్తున్నప్పుడు - ఆ శవం నిన్ను పలకరిస్తుంది. మాటలాడించబోతుంది-"

"శవం మాట్లాడడమా!" ఆశ్చర్యపోయాడు విక్రమార్కుడు.

"అది మామూలు శవం కాదు. ఆ చెట్టుమీద భేతాళుడుంటాడు. నువ్వు శవాన్ని భుజానికెత్తుకోగానే ఆ భేతాళుడు ఆ శవాన్ని ఆవహిస్తాడు.

ఆ భేతాళుడు నిన్నేవేవో ప్రశ్నలు వేస్తాడు. వాడు పలకరించినా నువ్వు బదులు చెప్పకు. నువ్వు మాట్లాగావో... నోరువిప్పావో...శవమూ శవంలోని భేతాళుడూ వెనక్కిపారిపోతారు. ఆ భేతాళుడే నా తపస్సుకు ఆటంకం కలగజేస్తున్నాడు. వాడిని నెత్తిమీద పెట్టుకుని నిశ్శబ్దంగా... మౌనంగా... యిక్కడికి తెచ్చావో - యిక నా కార్యానికి విఘ్నాలు కలిగించగలిగేవారెవరూ ఉండరు" "సరే" అని మర్రిచెట్టు వేపు బయలుదేరాడు విక్రమాదిత్యుడు.

చీకటి...జడలు విరబోసుకున్న దెయ్యాల్లా చెట్లు గాలికి ఊగుతూ... గుండెలు జలదరింపజేసేలా ఏవేవో పక్షుల కూతలూ జంతువుల అరుపులూ - వేటికీ వెరవకుండా - మర్రిచెట్టుని చేరుకున్నాడు తను. అక్కడి వాతావరణం మరీ భయంకరంగా ఉంది. నేలమీద మానవ కపాలాలు. స్వేచ్ఛగా తిరుగాడుతున్న భయంకర సర్పాలూ. ఎక్కడి నుంచో నక్కల ఊళలు. తోడేళ్ల అరుపులు.... గుడ్లగూబల నవ్వులు. వేటినీ లెక్కచెయ్యకుండా - మొలలో కత్తితో - మర్రి చెట్టు వేపు చూశాడు రాజు. మర్రి చెట్టు మహావికృతంగా ఉంది దాని కొమ్మకి శవం వేలాడుతోంది.

అతను చెట్టెక్కాడు. శవానికి కట్టిన తాళ్లని కత్తితో ఛేదించాడు. అంతే ఆ తాళ్లు తెగడమేమిటి, శవం మాట్లాడడం మొదలుపెట్టింది. దానిని పట్టకోబోతే అది యథాస్థానానికి పోతూంది. ఓహో! ఈ శవ శరీరంలో భేతాళుడున్నాడన్న మాట! - అనుకుని విక్రమార్కుడు శవానికున్న తాళ్లని కోస్తూనే దానిని గట్టిగా పట్టుకుని. నెత్తిమీద పెట్టుకుని బంధించి... చెట్టుదిగి...మౌనంగా నడవసాగాడు. అప్పుడు-

"రాజా!" పిలిచాడు భేతాళుడు - శవంలోంచి.

విక్రమార్కుడు పలకలేదు. మౌనంగా ఉండిపోయాడు. ఐనా వదలలేదు భేతాళుడు. "విక్రమార్క మహీపాలా! నేను- నీకు అలసట తెలియకుండానూ, యీ నిశీధిలో నడచి నడచి విసుగురాకుండానూ. ఒక కథ చెబుతాను. సరేనా?' 'అతను ఔననికాని కాదని కాని ఏమీ అనకుండా నిశ్శబ్దంగా ఉండిపోయాడు.





శవాన్ని మోసుకుంటూ నడవసాగాడు.

మళ్లీ భేతాళుడి అన్నాడు. "కథ చెప్పాక నేను నిన్నొక ప్రశ్నవేస్తాను. ఆ ప్రశ్నకి నీకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో తక్షణమే నీ తల వెయ్యి ముక్కలవుతుంది. కనుక జాగ్రత్తగా విను. కథ మొదలు పెడుతున్నాను. -"

భేతాళుడు హెచ్చరిస్తున్నట్లే అని - మొదట కథ చెప్పడం మొదలుపెట్టాడు.

విక్రమార్కుడు నోరు మెదపకుండానే నడుస్తూ కథ వినసాగాడు.

## ఎవరు భర్త? ఎవరు సోదరుడు?

"రాజా శోభావతీ అనే పురముండేది. దానిని యశఃకేతుడనే రాజు పరిపాలించేవాడు. అతను దేవ బ్రాహ్మణభక్తి కలవాడు. అంతే కాకుండా గొప్ప రాజకీయవేత్తగూడా. తన వేగుల (రహస్యముగా యితర దేశముల విషయములు తెలుసుకొను వారు) ద్వారా యితర దేశముల రహస్యములను సేకరించేవాడు. పని కొచ్చే సమాచారం తెచ్చిన వేగులకు చక్కని బహుమానాలనీ, విరివిగా జీతాల్నీ యిచ్చేవాడు.

మా కెప్పుడూ యీ రాజే కావాలని ప్రజలు కోరుకునే రీతిలో అతి చక్కగా.. ధర్మంగా రాజ్యపాలన చేస్తూండేవాడు. ప్రజలు ఎంతో సంతోషంగా ఉండేవారు.

ఆ నగరానికి బయట ఒక కాళికాలయం ఉండేది. ప్రతి సంవత్సరమూ ఆ దేవికి తప్పకుండా జాతర చేసేవారు. ఆ ఆలయం కెదురుగా ఒక కోనేరుంది. జాతరని చూడడానికి వచ్చిన స్త్రీలు ఆ కోనేరులో స్నానం చేసి, శుచిగా, దేవి నారాధించి వెళ్లేవారు.

ఒక యేడు-ఉత్సవం నాడు కొందరు ఆడవారు కొలనులో స్నానం చేస్తున్నారు. మరో దేశం నుంచి ఎక్కడికో వెళ్తూ తోవలో ఉన్న యీ చోటుకి అనుకోకుండా వచ్చిన ధవళుడను రజకుడు కోనేటిలో స్నానమాడుతున్న

ఒక స్త్రీని చూశాడు. అతనికా సౌందర్యవతి మీద విపరీతమయిన మోహం కలిగింది.

"ఈమె నాకు భార్య అయినచో.. కొంతకాలం కాపరం చేశాక నా శిరమును నీకు బలి యిచ్చుకుంటాను.. " అని ఆలయంలోని కాళికి మొక్కుకుని... దేవీపూజలు చేసి ఆమెను వెంటాడి, ఆమె యింటి గుర్తులు చూసుకుని... తానే పనిమీద బయలుదేరాడో అది మరచిపోయాడు. తన దేశానికి తిరిగి వచ్చి ... ఆ యువతియందు ప్రేమతో రోజురోజుకీ కృశించిపోసాగాడు. అతని తల్లిదండ్రులు కొడుకు పరిస్థితిని చూసి ఆయోమయంలో పడిపోయారు. ధవళుడు మంచం పట్టేశాడు. ఇక తల్లిదండ్రులు ఆరాటమూ, భయమూ ఆపుకోలేక కొడుకుతో మాట్లాడారు. సంగతేమిటని అడిగారు. అతను కూడా ఏదీ దాచుకోకుండా జరిగినదంతా చెప్పాడు. అతను యిచ్చిన గురుతులనిబట్టి - శోభావతీపురానికి వచ్చి కనుక్కోగా - ఆమెది కూడా వారి కులమే అని తెలిసింది. అందుకు వాళ్లెంతో సంతోషించి ఆమె పెద్దలను కలుసుకుని -

"నా కొడుకు మీ అమ్మాయియందు మనసుని లగ్నం చేసుకున్నాడు. ఆమె అతనికెంతో యిష్టము. నా బిడ్డకు మీ పుత్రిక నిత్తురా?" అని అడిగాడు.

"తప్పకుండా. మా కంగీకారమే" చెప్పారు అమ్మాయి తల్లిదండ్రులు. ఇకనేం?

కొద్దిరోజులలోనే ధవళుడికీ ఆమెకీ వివాహం జరిగిపోయింది. తరువాత ధవళుడు తన భార్యతో స్వగృహానికి వచ్చి - సుఖంగా ఉండసాగాడు.

కొంతకాలం గడిచింది. అప్పుడు ధవళుడి బావమరిది వచ్చాడు. అతనికి సోదరి అంటే ఎంతో ప్రేమ. "బావా! నిన్నూ మా సోదరినీ మా తల్లితండ్రులు యింటికి తీసుకురమ్మన్నారు. మీ తల్లితండ్రుల అనుమతి పొందాను. ఇక నీదే ఆలస్యం" అన్నాడు.





ధవళుడు అభ్యంతరం చెప్పలేదు. భార్యని తీసుకుని బావమరదితో తన అత్తవారింటికి బయలుదేరాడు.

వారు ముగ్గురూ ప్రయాణం చేసి చేసి శోభావతి నగర పొలిమేరలు చేరారు. అలసివున్న వారు కాళికాలయం.. కోనేరు... చూసేసరికి - ధవళుడికి గతం గుర్తుకొచ్చింది. దేవికి తాను మొక్కిన మొక్కు మనసులో మెదిలింది. అంతే భార్యకుకాని బావమరదికి కాని చెప్పకుండానే దేవాలయంలోకి వెళ్లి తన శిరసును కాళికి బలియిచ్చాడు.

బావ ఏమయ్యాడో తెలియక - "వెదికి వస్తాను-" అని బయలుదేరాడు బావమరిది. ఆ ప్రాంతమంతా తిరిగి-అతను చివరకి ఆలయంలోకి వచ్చాడు. తల తెగి పడివున్న బావని చూశాడు. అతనికేమీతోచలేదు. తను కూడా తలనరుక్కుని బావగారి పక్కనే పడిపోయాడు.

తన సోదరుడు - బావని వెదకడానికి వెళ్లినవాడు కూడా ఎంతకీ రాకపోవడంతో వారిద్దరినీ వెదకడానికి ఆమె బయలుదేరింది. వెదకి వెదకి వేసారి చివరకామె కాళికాలయానికి చేరింది. అక్కడ -

తన భర్తదీ, సోదరుడిదీ - తలలు. వాటిపక్కనే వారి మొండెములు కనిపించాయి. ఆమెకు భయము వేసింది, విపరీతమయిన దుఃఖమూ, వైరాగ్యమూ కూడా కలిగాయి. అ భీభత్సదృశ్యాన్ని చూసేసరికి - ఆమె ఏడుపు ఆపుకోలేకపోయింది.

"భర్త...సోదరుడు.. లేని జీవితం నాకెందుకు?" అనుకుంటూ కాళికాదేవి విగ్రహంముందే ఉరిపోసుకుని చనిపోబోయింది. అప్పుడు - కాళికాదేవి ప్రత్యక్షమై - "ఓ యువతీ! నీ పతి భక్తికి, సోదరప్రేమకీ ఎంతో సంతోషం కలిగింది. నీలాటి ఉత్తమ స్త్రీలు అకాల మరణం చెందకూడదు. ఎందుకు చనిపోతావు? నీ ఆప్తుల శిరస్సులను రెండింటినీ మొండెము(తలలేని శరీరభాగం)లకు కలుపుము. వారు తక్షణం బతుకుతారు" అంది. ఆమెవైపు దయగా చూస్తునే అదృశ్యమయింది.






అనూహ్యమూ, అత్యంత ఆనందదాయకమూ అయిన దేవి వరానికి ఆశ్చర్యపోతూనూ తన భర్తా, సోదరుడూ మళ్లీ జీవంపొందుతారన్న విశేష సంతోషంలోనూ. తొట్రుపాటు పడిపోతూ ఆమె భర్త శిరస్సును సోదరుని మొండానికీ, సోదరుని శిరస్సును భర్త మొండానికీ కలిపింది. అపరిమితమయిన అనందంలో కూడా కంగారు సహజమేకదా? వారిద్దరూ ప్రాణమొచ్చి లేచి కూర్చున్నారు.

ఆమె వారిద్దరినీ చూసింది. తన పొరపాటు తెలిసి వచ్చింది. తాను చేసిన తెలివితక్కువ పనికి విచారిస్తూ ఏడవసాగింది. వీరిద్దరిలో ఎవరు తనభర్త? సోదరుడెవరు? తేల్చుకోలేక తెల్లమొహం వేసి ఉండిపోయింది. ఆమెకేమీ తోచడంలేదు.

రాజా! వారిద్దరిలోనూ ఆమె భర్త ఎవరు? ఆమెకు సోదరుడు కాదగిన వాడెవరు? సకారణంగా సమాధానం చెప్పు?" అన్నాడు భేతాళుడు.

సమాధానం తెలిసిన విక్రమార్కుడు సమస్యను పరిష్కరించకుండా ఉండలేకపోయాడు. "సర్వేంద్రియాణం నయనం ప్రధానమని, సర్వేంద్రియాణం శిరః ప్రధానం అనీ పెద్దలు చెప్పిన న్యాయమూ ధర్మము. నయనమూ, బుద్ధీ ఉండేవీ శిరస్సులోనే కనక మనిషి గుర్తింపు అతని శిరఃభాగం బట్టే జరగడం సముచితం. కనుక పతి శిరస్సు కలవాడామెకు భర్త. రెండవ మగవాడామె సోదరుడు- చెప్పాడు విక్రమాదిత్యుడు.

భేతాళుడతని పరిష్కారాన్ని మెచ్చుకున్నాడు. కాని - విక్రమాదిత్యుడికి మౌనభంగమయింది. కనుక - రాజుతలపైనుండి శవమూ, దాని యందలి భేతాళుడూ మళ్లీ వెళ్లి చెట్టుకు వేలాడ సాగారు.

## ఎవరు గొప్ప?

"విక్రమార్కా! పూర్వం మల్లికాపురమనే నగరం ఉండేది. దానిని శకటశృంగుడనే రాజు పాలించేవాడు. అతని వద్ద కార్పాటకుడనే సేవకుండేవాడు.

కార్పాటకుడత్యంత విశ్వాసపాత్రుడయిన సేవకుడు. అతను రాజునొక్క నిముషమయినా విడచి పెట్టేవాడు కాదు. రాజుని కంటికి రెప్పలా కాపాడుకునేవాడు.

ఒకనాడు రాజు వేటకి బయలుదేరాడు. రాజుతోపాటు పరివారం కూడా బయలుదేరింది. రాజు అరణ్యంలో అనేక జంతువులని వేటాడాడు. అంతలో అతనికొక అడవిపంది కనిపించింది. దాని నెలాగైనా వేటాడాలనుకుని వెంటపడ్డాడు రాజు.

ఆ అడవిపంది టక్కరిది. రాజుకి కనపడినట్లే కనపడుతూ, దొరక్కుండా చాలా దూరం తీసుకుపోయింది. కార్పాటకుడు మాత్రం అతి కష్టంమీద ప్రభువననుసరిస్తున్నాడు. అడవిలో చాలా దూరం రాజుని తన వెంట పరుగెత్తించి - అడవి పంది మరి అతనికి కనపడకుండా పోయింది. రాజక్కడ ఆగిపోవలసి వచ్చింది.

అది, నిర్మానుష్యమైన ప్రదేశం. కనుచూపుమేర మానవుడన్నవాడు కనిపించడంలేదు. రాజేమో చాలా అలసిపోయి ఉన్నాడు. అతనికెంతో దాహంగా ఉంది. ఉస్సు ఉస్సు అంటూ ఓ చెట్టుకింద కూర్చుండిపోయాడు. ఏం చేయాలో తోచక.

సరిగ్గా అప్పుడు-

కార్పాటకుడతని ఎదుట దేవుడిలాగే ప్రత్యక్షమయ్యాడు. ఊరికే ప్రత్యక్షం కావడమే కాక రెండు ఉసిరికాయలనందించాడు, రాజు ఆత్రంగా వాటిని తిన్నాడు. అతని దాహం తీరింది. శరీరంలోకి కొంచెం శక్తీ, ఉత్సాహమూ చేరాయి. సేవకుడయిన కార్పాటకుడి భక్తివిశ్వాసాల కతనెంతో సంతోషించాడు. అడవిపంది మరికనపడదని తేల్చుకుని తన పట్నానికి బయలుదేరిపోయాడు.

కొన్నాళ్లు గడిచాయి-

ఒకరోజు - శకటశృంగ మహారాజు కార్పాటకుడిని తన దగ్గరగా





పిలిచాడు. "కార్పాటకా! నువ్వు స్వామిభక్తి పరాయణుడివి. అందుచేత నా మనసులోని కోరికను నీకే చెబుతున్నాను. నువ్వే నా కోరికని సాధించగలిగే సమర్థుడివి. అందుకని నిన్నే యీ పనికి నియమిస్తున్నాను." అన్నాడు.

"ఆజ్ఞాపించండి-" అన్నాడు కార్పాటకుడు వినయ విధేయతలతో.

"సింహళదేశాధిపతి కుమార్తె చాలా అందమయినదనీ, విద్యాధికురాలనీ విన్నాను. అలా విన్నప్పటినుంచీ ఆమెను వివాహమాడాలని ఉవ్విళ్లూరు తున్నాను. నువ్వారాజు వద్దకు వెళ్ళి ఆమెను నాకిచ్చి పరిణయం చేసేటట్లు మాట్లాడి ఒప్పించాలి. వెళ్లు. కార్యం సఫలం చేసుకురా." అని అతన్ని పంపాడు.

కార్పాటకుడు ఒక వర్తకుని ఓడ సింహళం వెళ్తూంటే దానినెక్కాడు.

మధ్యతోవలో - పెద్ద తుఫానొచ్చింది. కార్పాటకుడెక్కిన ఓడ పగిలిపోయి నీటిలో మునిగిపోయింది. ప్రయాణీకులందరూ సముద్రం పాలయ్యారు. కాని కార్పాటకుడికి మాత్రం ఒక కొయ్య దొరికింది. దాని సాయంతో నీళ్లలో కొట్టుకురాసాగాడు. కొంతసేపలా కొయ్యతో ప్రయాణం చేశాక - నీటిలో ఒక తీగ కనిపించింది. అతను దానిని పట్టుకున్నాడు. అది అతన్ని నీటిలోపలకి ... సముద్రంలోపలికి.... అడుక్కు లాక్కుపోయింది. నాగలోకానికి చేర్చి వదిలింది. అక్కడికెదురుగా ఒక దేవాలయం ఉంది.

అతను నీటిలో మునిగి రావడం వలన కలిగిన శ్రమను తీర్చుకుందుకా దేవాలయంలో విశ్రమించాడు.

ఆ దేవాలయానికి ప్రతిరోజూ చాలామంది నాగకన్యలు వస్తారు. దైవపూజ చేస్తారు. నాట్యాలు అభినయిస్తారు. వీణవాయిస్తూ శ్రుతి బద్ధంగా పాటలు పాడతారు. అలాగే ఆ వేళకూడా కొందరు నాగకన్యలు వచ్చి సంగీతం పాడుతూంటే - ఆ శబ్దాలకి కార్పాటకుడికి మెలకువ వచ్చింది. కళ్లు పెద్దవి చేసుకుని వారిని చూసాడు. వారిలో ఒక నాగకన్యపై అతను మనసుపడ్డాడు. ఆమె చాలా అందంగా ఉంది.

ఆమె చెలికత్తె ద్వారా తన కోర్కెను తెలిపాడు.

"ఆ బాటసారి నీమీద మనసుపడ్డాడట. నీపై మోహంతో మైమరచి పోతున్నాడుట-" అని విన్నవించుకొంది.

"ఏడిశాడు వాడి మొహానికి మనసుకీ నేనే దొరికానా! వాడికి బుద్ధి చెప్పాలి. ఎలాగేనా వాడిని పరాభవించితీరాలి" అని నిశ్చయించుకుని - అతని వద్దకు నడచింది.

"నువ్వంటే నా కిష్టమే. కాని...నేను నీ కోరికతీర్చాలంటే-మా దేశాచారం ప్రకారం - ముందు నువ్వా నీటి గుంటలో మునిగి స్నానం చేయాలి' అంది.

అదెంత పని అనుకున్నాడు కార్పాటకుడు. క్షణం ఆలస్యం చెయ్యకుండా ఆ నీటిగుంటలోకి ఉరికాడు. అంతే.

ఆ నాగకన్య మహిమవల్ల కాబోలు - అతను నీటిలో మునిగిందే తడవుగా - తన ప్రభువు పాలించే మల్లికాపురంలోని ఒక కోనేటిలో తేలాడు. అతని ఆశ్చర్యానికి మేరలేదు. వెంటనే ప్రభువుని చేరుకుని జరిగినదంతా అతనికి తెలియపరిచాడు.

రాజు చాలా ఆశ్చర్యపడి - నువ్వు చూసిన స్త్రీని నాకు చూపించమని అడిగాడు. అప్పుడు కార్పాటకుడు తాను మునుపు వెళ్లిన మార్గములో రాజును తీసుకుని వెళ్లి నాగలోకమందలి దేవాలయం చేర్చి- ఆ నాగకన్యలను చూపించాడు.

కార్పాటకుడంతకు ముందు మోహించిన నాగకన్య నిజంగానే అత్యద్భుత సౌందర్యంతో వెలిగిపోతూంది. మిగిలిన వారి మధ్య ఆమె చుక్కల్లో చంద్రుడిలాగే ఉంది.

ఆమె రాజును చూసినదే తడవుగా- అతని మీద మోహం చెంది - అతని ముందుకు వచ్చి " రారాజా! నీకేది కావాలంటే అది యివ్వగలను. దయయుంచి నా కోరిక తీర్చు. నీపైమోహంతో నేను తాళలేకపోతున్నాను'





అంటూ వేడుకుంది. ఆమె మాటలకు - రాజు -" ఓ సుందరీ! ఇతను నా కొడుకు వయసులో ఉన్నాడు. నా కంటే అన్నివిధాలా గొప్పవాడు. ముందు అతని కోరిక తీర్చి సుఖాల్లో తెల్చు" అన్నాడు కార్పాటకుణ్ని చూపుతూ. రాజే అలా అన్నాక చేయగలిగిందేమీ కనిపించక నాగకన్య కార్పాటకుణ్ని అంగీకరించింది. రాజు వారిద్దరినీ ఒక చోట చేర్చి - "కార్పాటకా! ఆవేళ.. నేను అరణ్యంలో అతిదాహంతో బాధపడుతుండగా నువ్వు నాకిచ్చిన రెండు ఉసిరిపళ్లలోనూ ఒకదానికి యీ నాగకన్యను నీకు జతకూర్చుటతో సరిపోయినది. ఇంకొక పండుకు మాత్రమే నేను రుణపడి ఉన్నాను." అని - మునుపు కార్పాటకుడు మునిగిన నీటిగుంటలో తాను మునిగి తన నగరమున తేలాడు. కార్పాటకుడు నాగలోకంలో సౌందర్యవతితో హాయిగా సుఖిస్తూ గడపసాగాడు.

రాజా వీరిద్దరిలో ఎవరు చేసిన ఉపకారము గొప్పదో నిర్ణయించి చెప్పు. సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో-" అంటూ హెచ్చరించాడు భేతాళుడు. విక్రమార్కుడికిదేమీ అంత జటిలమయిన ప్రశ్నలా అనిపించనట్లుంది. "భేతాళా! శకటశృంగుడు రాజు. కార్పాటకుడు అతని వద్ద సేవకుడు. సేవకుడు స్వామిభక్తిని ప్రదర్శించడం అతని విధే తప్ప అదనపు గొప్పతనమేమీ కాదు. కనుక - అరణ్యములో దాహముతో ఉన్న రాజుకు కార్పాటకుడు ఉసిరిపండ్లనిచ్చుటలో - విద్యుక్త ధర్మమే గోచరిస్తుంది. కాని - రాజు, భృత్యుడు చేసిన మేలుని మరవకపోవడమూ, ఆ మేలుని రుణంగా భావించి, ప్రత్యుపకారం చేసి - తీర్చుకోవడమూ అతని చిత్తశుద్ధికి, విశాల హృదయాన్ని, సమాన భావాన్నీ తెలుపుతాయి. అందుచేత - కార్పాటకుడు చేసిన ఉపకారంకంటే, శకటశృంగమహారాజు చేసిన ప్రత్యుపకారమే శ్లాఘించతగినది" అని చెప్పాడు.

"నిజమే" అంగీకరించాడు భేతాళుడు.





విక్రమార్కుని మౌనానికి భంగం కలగడంతో - అతని తలమీదనున్న శవం మళ్లీ వెళ్లి మర్రి చెట్టుకు వేలాడసాగింది.

## తప్పెవరిది?

మంత్రోపదేశం పొందిన నలుగురు అమాయకపు విప్రసోదరులు తమ మంత్రాలెలా పనిచేస్తాయో పరీక్షించాలనుకున్నారు. వాళ్లు నడుస్తున్న అడవిదారి పక్క ఒక ఎముక కనిపించింది. నాలుగోవాడు దానిని ముందుంచుకుని మంత్రం జపించేసరికి ఆ ఎముక తాలూకు జంతువు యొక్క అస్తిపంజరం ఏర్పడింది. మూడోవాడు తన మంత్రం పఠించేసరికి ఆ అస్తిపంజరానికి మాంసం, రక్తం, పేగులు మొదలయినవి అమిరాయి. రెండోవాడు తను నేర్చుకున్న మంత్రం ఉచ్చరించేసరికి - ఆ ఆకారానికి చర్మమూ, రోమాలూ (వెంట్రుకలు) గోళ్లూ ఏర్పడ్డాయి. అప్పుడేనా- అది పెద్దపులి అని ఆగకుండా పెద్దవాడు తను నేర్చిన మంత్రం చదివేశాడు తొందరగానూ అమాయకంగానూ. దాంతో ఆ ఆకారానికి ప్రాణమూ చైతన్యమూ వచ్చేశాయి. ఆపెద్దపులి-ఆకలిమీదుండి-నలుగురన్నదమ్ములనీ తినేసింది. "రాజా! తప్పెవరిది? పాపమెవరిది?" అని అడిగాడు భేతాళుడు. "తప్పు కాని, పాపంకాని ఆనలుగురిలోనూ ఎవరిదీ కాదు ఎందుకంటే- నలుగురికి నలుగురూ అమాయకులు. వారిలో ఏఒక్కడికీ యితరులను చంపాలనే దుష్ట తలంపు లేనేలేదు. చెప్పాడు విక్రమార్కుడు. అతని మౌనం చెడడంతో భేతాళుడు శవంతో పాటే మాయమయ్యాడు.

## ఆత్మహత్యకు అసలు కారణం

భూలోకంలోని నగర రాజ్యాలన్నిటికీ కిరీటంలాటిది విజయనగరమనే పురం. దాని రాజు వంశకేతుడు. అతను నిత్యవ్రత అనే రాకుమారిని వివాహమాడి - ఆమెపై వలపు వీడలేక రాత్రింబవళ్ళు అంతఃపురంలోనే గడుపుతూ రాచకార్యములను పట్టించుకోవడం మానేశాడు.

అతని మంత్రి తీర్థదర్శి. పాలనా వ్యవహారాలు చూసేవాడు. దాంతో – "ఈ మంత్రి ఎప్పుడో ఒకనాడు రాజునణచి రాజ్యము నపహరించును" అని పుకార్లు పుట్టసాగాయి. అవి మంత్రికి తెలిసాయి.

"లోకులు కాకులవంటివారు. వారికి నా మనసులోని ఉద్దేశం తెలియదు. నిజం తెలియకే యిలాటి నిందలు వేస్తున్నారు. లోకనింద భరించడం మహాకష్టం. ఇలా అపవాదుపడ్డాక రాజ్యం విడిచిపోవడమే మంచిది." అనుకున్నాడు – తీర్థదర్శి. ఈ విషయం రాజుకి తెలిపి మరోమంత్రికి రాజ్యాధికారం యిచ్చాడు.

దేశత్యాగం చేసిన తీర్థదర్శి అనేక దేశాలు తిరిగి తిరిగి చివరకి సముద్రతీరంలో ఉన్న ఒక నగరాన్ని చేరుకుని అక్కడి వర్తకులలో ఒకరితో స్నేహం చేసి నిరంతరమూ అతనిని విడవకుండా ఉంటూండేవాడు.. ఒక రోజు – ఆ వర్తకుడు తన స్నేహితునితో – "నేనిప్పుడే బయలుదేరి ఓడపై ద్వీపానికి వెళ్తున్నాను. నేను పని చూసుకుని వచ్చేవరకూ నువ్విక్కడ నా బదులుగా అన్ని పనులూ చూడు" – అన్నాడు.

"నిన్ను విడచి నేనొక్కనిముషయినా ఉండలేను. నేనూ నీతోవస్తాను' ' అన్నాడు తీర్థదర్శి. అలాగ వారిద్దరూ ఓడమీద వెళ్తూ – ఒక ద్వీపంలో అద్భుత సౌందర్యవతినొకామెను చూశారు. ఆమెను చూసి అమితాశ్చర్యానికి లోనయిన తీర్థదర్శి – "ఈమె ఎవరు? అని అడిగాడు. వర్తకుడు – "ఈ కన్యారత్నమెవరో నాకు తెలియదు. కాని నేను ఓడమీద వచ్చినప్పుడల్లా యీమెనిక్కడ తప్పకుండా చూస్తుంటాను" అని చెప్పాడు.

తరువాత తీర్థదర్శి కొంతకాలానికి స్వదేశానికి తిరిగి వెళ్లిపోయాడు. తన మునుపటి రాజగు వంశకేతుడిని సందర్శించాడు. ఆ రాజు తీర్థదర్శిని చూసి ఎంతో ఆనందించి – కౌగలించుకొని, గౌరవించి కుశల ప్రశ్నలడిగి – "నన్నెందుకు విడచివెళ్లావు?" అని అడిగాడు.

"రాజా! నువ్వు స్త్రీలోలుడివై అంతఃపురము విడచిరాక





రాచకార్యములు నిర్వహింపకపోవుటచే నేనీ రాజ్యమును హరింతునని లోకోపవాదములు పుట్టాయి. ఆ నిందలు భరించలేకనే దేశం విడచి వెళ్లాను–" అని చెప్పాడు తీర్థదర్శి. రాజు విశేషాలేమిటని అడిగాడు. "ఒకచోట నేనొక వర్తకునితో స్నేహం చేసి.. అతనితో మరోద్వీపం ఓడమీద వెళ్లాను. అక్కడ ఒక చోట కాళికాలయముంది. దాని ముందున్న చెట్టు నీడలో ఒక కన్యారత్నం ఎప్పుడూ ఉంటుంది. ఆమె ఎంత అందగత్తో నేను చెప్పలేను. నేనెన్నడూ అంత చక్కని స్త్రీని చూడలేదు.." అని తీర్థదర్శి చెప్పేసరికి వంశకేతుడు చాలా ఆశ్చర్యపోయి – "తీర్థదర్శీ! నేనామెను చూడాలి! నా బదులు నువిక్కడుండు. త్వరలోనే వచ్చేస్తానులే" అంటూ అక్కడికి వెళ్లడానికవసరమయిన వివరాలు తెలుసుకుని – వర్తకునితో స్నేహంచేసి అతనా ద్వీపం వెళ్లేటప్పుడు వెంటవెళ్లి – మంత్రి చెప్పిన చోట ఆ కన్యకను చూసి ఆమె పట్ల మోహమూ, ప్రేమలో పడి – కాళికాలయంలో పూజచేసి – ప్రసాదం తీసుకుని ఆమె వద్దకు వచ్చాడు.

ఆమె అతన్ని చూసి దాక్కోబోగా – ఆమె కొంగు పట్టుకుని వదలకుండా ఎన్నో విధాల ఆమెను ప్రార్థించాడు. ప్రాధేయపడ్డాడు. అతను రాజని తెలిసి ఆమె అంగీకరించింది. వాళ్లిద్దరూ సుఖాలలో ఓలలాడారు. ఒకనాడు –వ్రతం నిమిత్తమామె నీటిలో మునగగా ఒక రాక్షసుడామెను మింగేశాడు. రాజు ఆ రాక్షసుడి పొట్టను తన కత్తితో చీల్చి తన భార్యను బయటకు తెచ్చాడు. కొన్నాళ్లు గడిచాక ఆమెను వెంటబెట్టుకుని తన రాజ్యానికి చేరుకున్న రాజు మునపటికంటె మరింతగా కాంతాలోలుడయి అంతఃపురందాటి బయటకు రావడం మానేశాడు.

అది చూసి మంత్రి విషం తాగి బలవంతంగా మరణించాడు? రాజు తిరిగి వచ్చాడనా? లేక తాను చూచినకాంత తనకి కాకుండా రాజుకి దక్కిందనా?" అడిగాడు భేతాళుడు. అందుకు – "భేతాళా! రాజు యిదివరకే స్త్రీలోలుడు. అది తెలిసి కూడా తానా స్త్రీ గురించి అతనికి చెప్పినందువల్లనే





రాజు రాచకార్యములు మానేశాడు. ఆ అపవాదు తనమీదే పడుతుందని భయపడి మాత్రమే ఆ మంత్రి ఆత్మహత్య చేసుకున్నాడు. తప్ప మరేకారణమూకాదు-" అని జవాబిచ్చాడు విక్రమార్కుడు.

అతని మౌనానికి భంగమవడంతో భేతాళుడు మాయమై యథాస్థానం చేరుకున్నాడు.

## మహాసుకుమారి

విక్రమార్కా! జాగ్రత్తగా విను. మదనపురాన్ని పాలించే మీనకేతుడికి ముగ్గురు భార్యలుండేవారు. రాజుకి ఆ ముగ్గురియందూ సమాన ప్రేమే. ఒకనాడతను మంత్రితో - "నేనొకరోజు పెద్ద భార్య అయిన సౌందర్యవతితో పూలవనంలో విహరిస్తూంటే - ఒక చెట్టునుంచి పువ్వు రాలి ఆమె చేతిమీద పడింది. అంతే క్షణంలో ఆమె చెయ్యి ఎర్రగా కందిపోయింది.

మరొకసారి నేను నా రెండో భార్య శుభాంగితో మేడమీద విహరిస్తున్నాను. ఆ వేళ పున్నమి. వెన్నెల వచ్చింది. అంతే ఆమె పున్నమి వెన్నెలను సహించలేక మూర్ఛపోయింది.

ఇక - నా మూడో భార్య విలాసవతి విషయం విను. ఒకసారామె చిన్న పిల్లవాడి రోదన వింటూనే చెవులు దిబ్బళ్ళు వేసి - స్మారకం (స్పృహ) తప్పిపడిపోయింది" అన్నాడు. "రాజా! వీరు ముగ్గురిలోనూ అత్యంత సుకుమారి ఎవరు?" అడిగాడు భేతాళుడు. సౌందర్యవతి చేతి మీదపడిన పువ్వులో ఏ కీటకమో ఉండి కుట్టుటచే ఆమె చేయికంది ఉండ వచ్చును. నిండు వెన్నెలకు - యౌవనంలో ఉన్నవారికున్మాదం కలిగించే గుణం ఉంది. శుభాంగికి అటువంటి వ్యాధి ఉండి - వెన్నెల వలన ప్రకోపించి ఉండవచ్చును. కాని...విలాసవతి శరీరమేకాక మనసుకూడా మహాసుకుమారమయినది కనుకనే బాలుడి రోదనకే ఆమె సొమ్మసిల్లిపోయింది. ఆమే మహాసుకుమారి." చెప్పాడు విక్రమార్కుడు.

# ఎవరు పెళ్లి చేసుకోవాలి?

స్వర్ణపురమనే మహానగరంలో నిగమశర్మ అనే బ్రాహ్మణు డుండేవాడు., అతనికి సర్వాంగసుందరమయిన కుమార్తె ఉండేది. ఆమె సౌందర్యానికి ముగ్ధులై మహారాజులు సైతం ఆమెను వివాహం చేసుకోదలచి వచ్చేవారు. కాని నిగమశర్మ - వారికి.

"అయ్యలారా! నా బిడ్డకు మేనమామలున్నారు. నేను భోగభాగ్యములకొరకు మేనరికమును వదలజాలను" అని వారిని పంపివేసేవాడు.

ఆమె మేనమామలు ముగ్గురూ ఒకేసారి వచ్చి - "మీ అమ్మాయిని నాకే యివ్వా"లంటూ నిగమశర్మను కోరడమేకాక వారిలో వారక్కడే తగవులాడుకుని కొట్టుకొనుటకు సిద్ధపడిరి. అది గమనించిన గ్రామపెద్దలు -"యువకులారా! ఇటువంటి పరిస్థితిలో మీలో మీరెంత తగవులాడుకొన్ననూ ప్రయోజనముండదు. మీకు ఆరు నెలలు గడువిచ్చుచున్నాము. మీలో ఎవరయితే ప్రపంచంలోకెల్లా అతి విచిత్రమయిన వస్తువును తెస్తారో వారికే నిగమశర్మ కుమార్తెనిచ్చి వివాహము చేయుదుము" అని తీర్పు చెప్పారు. నిగమశర్మ కూడా అందుకంగీకరించాడు.

అన్నదమ్ములు ముగ్గురూ స్వర్ణపురంనుండి నూరామడల దూరమందున్న పట్టణము వరకూ కలసి ప్రయాణం చేశాక -"సోదరులారా! ఇకపై మన ముగ్గురమూ మూడు వైపులకి పోవుదము, తిరిగి యిక్కడికే వచ్చి కలుసుకొన్న తరవాత మామయ్య యింటికి వెళ్దాం.." అనుకుని ఒక్కొక్కరూ ఒక్కొక్క దిక్కుగా వెళ్లిపోయారు.

ఆరునెలలు పూర్తి కాబోయేటంతలో - పెద్దవాడొక పేము బెత్తమునూ, రెండవవాడొక కీలుగుర్రాన్నీ, మూడవవాడొక అద్దము సంపాదించుకుని వచ్చి అక్కడ కలుసుకున్నారు.

చిన్నవాడు అద్దంలో చూచి -"సోదరులారా! మన శ్రమంతయూ బూడిదలో పోసిన పన్నీరువలె వ్యర్థమైపోయినది. మన మేనకోడలు





మరణించినది. ఆమె శవమును స్మశానమునకు తీసుకుపోయి చితిపై ఉంచారు. కొన్ని నిముషాలలో అగ్ని సంస్కారం జరుగగలదు" అన్నాడు. వెంటనే రెండవ వాడు కీలుగుర్రం మీద తన సోదరులిద్దరినీ ఎక్కించుకుని -"ఓ అశ్వమా! మమ్ము తక్షణం మా మేనకోడలి శవమున్న స్మశానమునకు చేర్చుము." అన్నాడు. ఆ గుర్రం కన్ను మూసి తెరిచేంతలో వారిని చేరవలసిన చోటుకు చేర్చింది.

అప్పటికే శవమునకు అగ్నిసంస్కారం జరగడానికంతా సిద్ధంగా ఉంది. పెద్దవాడు చితిమీద ఉంచిన మేనకోడలి శవమును తన పేముబెత్తముతో మూడు దెబ్బలు కొట్టి -"చిన్నదానా! లే." అని ముమ్మారన్నాడు. అంతే. ఆ సుందరి నిద్రలోంచి లేచినదానిలా చితిమీద లేచి కూర్చుంది.

అప్పుడు మళ్లీ అన్నదమ్ముల్లో ఆమెకోసం తగవు మొదలయింది. "నేను అద్దంలో చూచి చెప్పడం బట్టికదా మీకు పరిస్థితి, ప్రమాదమూ తెలిశాయి. కనుక నేనే మేనకోడలిని పెళ్లి చేసుకుందుకు తగినవాడిని-" అని వాదించాడు చిన్నవాడు. "అద్దంలో చూచి చెప్పినా సకాలంలో యిక్కడికి చేరకపోతే ఏం ప్రయోజనం? సకాలంలో మిమ్మల్నిక్కడికి కీలుగుర్రంమీద చేర్చింది నేను. కనుక మేనకోడలిని వివాహమాడడానికి అర్హుడిని నేనే" అని నిర్ద్వంద్వంగా చెప్పాడు రెండోవాడు. "నేనిక్కడకి చేర్చకపోతే బెత్తంతో ఆమెకు ప్రాణం తెప్పించడం కూడా సాధ్యపడేది కాదు."

"అద్దంలో చూసి చెప్పినా... కీలుగుర్రంమీద వచ్చినా... ఆమెకి ప్రాణదాత నా బెత్తమే. కనక - మేనకోడలిని పరిణయమాడడానికి యోగ్యుణ్ని నేనే" అన్నాడు పెద్దవాడు. రాజా! ఆ అన్నదమ్ములు ముగ్గురిలోనూ ఆమెను వివాహం చేసుకునేందుకు అర్హులెవరు?" ప్రశ్నించాడు భేతాళుడు.

"భేతాళా! వింత వస్తువులను తేవడంతో ముగ్గురన్నదమ్ములూ సమానమే. కాని.. మేనరికమునందు తగిన వరుడు పెద్దవాడు. కనుక ఆ

సౌందర్యవతికి మేనమామలయిన ఆ ముగ్గురన్నదమ్ములలోనూ పెద్దవాడికే ఆమెను వివాహం చేసుకునే అర్హతుంది. అదే శాస్త్రం." అని చెప్పాడు విక్రమార్కుడు. దాంతో అతని మౌనం భంగపడింది. భేతాళుడా సమాధానానికి మెచ్చుకుంటూనే అంతర్ధానమయిపోయాడు.

## స్త్రీ పురుషులలో ఎవరు మంచివాళ్లు? ఎవరు చెడ్డవాళ్లు?

పూర్వం ఒక రాజుగారి న్యాయస్థానానికి అతి విచిత్రమయిన కయ్యము విచారణకు వచ్చింది. కోశాధికారియింట్లో ఉండే పావురాల జంటలో కుటుంబ కలహం ఏర్పడి - ఆ కలహం పెరిగి పెరిగి పెద్దదై - ధర్మమునను సరిస్తాడనే పేరొందిన రాజు వద్దకు వచ్చింది.

ఆడపావురం యిలా చెప్పుకుంది. "ప్రభూ! ప్రపంచంలో పురుషజాతి అతి క్రూరమైనది. రత్న గిరియందుండే శశాంకుడు నీచుడూ దుర్మార్గుడూ అయినా అతని మీద దయతో - క్షమాకారుడు తన కుమార్తె సుశీలనిచ్చి వివాహం చేశాడు, పతియే దైవముగ భావించుచు కాపురం చేయుచున్న సుశీలను - జూదరీ, తాగుబోతూ అయిన శశాంకుడు నానాహింసలూ పెట్టేవాడు. కాపురాన్ని అప్పులపాలుచేశాడు.

సుశీల పుట్టింటికి వెళ్లి-"మీ అల్లునకు వ్యాపారమందు నష్టమొచ్చింది' అంటూ తండ్రినుంచి డబ్బు తీసుకురాగా...శశాంకుడామె ధనమునంతయూ అపహరించి - వనభోజనం నెపంతో భార్యనొక అడవికి తీసుకెళ్ళి నూతిలోకి తోసేశాడు. కాని.. సుశీల ఎలాగో బతికి బయటపడి మళ్లీ పుట్టింటికి చేరి మగని దుర్మార్గమును బయటపెట్టక - ఏవో సాకులు చెప్పి - మళ్లీ తండ్రినుంచి డబ్బు తీసుకుని వస్తూంటే - శశాంకుడామెను తోవలోనే చంపివేసి ఆ డబ్బును పట్టుకుపోయి తాగుచూ జూదమాడుచుండెను.

మగవారు కుటిలురూ, కుత్సితులూ అనడానికింకేం నిదర్శనం కావాలి?' అని ముగించింది. ఈసారి మగపావురం చెప్పసాగింది.

"అమరావతి నగరమందుండే ఉత్తముని భార్యరూపవతికి క్షయవ్యాధి వచ్చింది. బంధువులూ మిత్రులూ అందరూ - ఆ వ్యాధి నయమయ్యేది కాదనీ అనవసరంగా వైద్యం పేరిట ధనం వ్యర్థం చేయొద్దనీ బోధించినా భార్యని ఎంతో ప్రేమించే ఉత్తముడు తన ధనమునే కాక రక్తమును కూడా భార్యకి ధారపోశాడు. దాంతో రూపవతి వ్యాధినయమయి పరిపూర్ణారోగ్యం పొందింది. కాని -

రక్తమును కోల్పోయిన ఉత్తముడు తగిన ఆహారంలేక నీరసించిపోయి - ధనార్జన చేయలేక భార్యనగలనమ్మాలనుకున్నాడు. రూపవతి - భర్త తన కోసం చేసిన త్యాగాన్నయినా తలచకుండా - తన పుట్టింటికి పోయి గ్రామంలో ఉన్న యువకులతో వ్యభిచరించుచూ - జారిణికాగా- నిజం తెలిసిన ఆ యువకులు ఆమె ముక్కు చెవులు కోశారు. రూపవతి - తన భర్తే తన ముక్కు చెవులని కోశాడని ప్రచారం చేయగా రాజు ఉత్తముని ఉరితీయించాడు.

భార్యనెంతో ప్రేమించిన ఆ భర్తకు లభించిన ఫలమది. కనుక - ప్రపంచంలో స్త్రీజాతి ఎంత మాత్రమూ మంచిది కాదు."

విక్రమార్కా! వారి మాటలు విన్నావు కదా? స్త్రీ పురుషులలో ఎవరు మంచివాళ్లు? ఎవరు చెడ్డవాళ్లు?" అడిగాడు భేతాళుడు.

స్త్రీలయినా పురుషులయినా మానవజాతే. ఇద్దరికీ మానవవిలువలు సమానమే. ఆ విలువలను నిలబెట్టుకోలేకపోయిన వారు స్త్రీ అయినా పురుషుడయినా చెడ్డవారే. మంచి చెడులకి లింగ భేదముండదు." అన్నాడు విక్రమార్కుడు. అతని మౌనానికి భంగమవడంతో - భేతాళుడు అదృశ్యమైపోయాడు.

## ఆ పాపం ఎవరిది?

పాటలీపుత్రంలో నారాయణ దీక్షితుడనే పేరుకల బ్రాహ్మణునికి చాలా అందమయిన భార్య ఉండేది. ఆమె పేరు సుందరి. (ఈ పేరు కల్పితం)





ఒకనాటి వెన్నెలరాత్రి నారాయణ దీక్షితుడు భార్యతో - సౌధాగ్రమున మేడ మీద ఆరుబయట వెన్నెలపలలో ఆకాశం కనిపించేలా... నిద్రపోయాడు.

ఆ సమయంలో ఆకాశవీధిలో విహరిస్తున్న గంధర్వుడొకడా బ్రాహ్మణ స్త్రీ సౌందర్యానికి మురిసి - తన మంత్రశక్తితో ఆమె నపహరించుకుపోయాడు.

ఉదయం నిద్రలేచిన నారాయణ దీక్షితులుకి భార్య కనపడలేదు. ఆమెకోసం ఎన్నిచోట్ల వెదకినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఆమె కనిపించలేదు. తిరిగి తిరిగి అతనొక అడవిని చేరుకోగా అక్కడొక మహాముని కనిపించాడు. దీక్షితులాయనకి ప్రణామం చేసి తనదీనావస్థను కన్నీటితో విన్నవించుకున్నాడు.

ఆ జడధారి మనసు కరిగింది. తన దివ్యదృష్టితో సుందరి ఉన్న చోటుని కనుక్కున్నాడు. "ఆ గంధర్వుడి మదం అణచి నీ భార్యని చెరవిడిపించి తీసుకువచ్చే ప్రయత్నం మొదలుపెడుతున్నాను-" అంటూ ఆ కార్యక్రమంలో దిగాడు.

ఆ గంధర్వుడు కూడా తన దివ్య దృష్టితో భూలోకంవేపు చూశాడు. సుందరి భర్తయిన దీక్షితులు తపస్వి సహాయం పొందాడని తెలుసుకుని -

"ముందు నేనే అతన్ని చంపివేస్తే మంచిది కదా.." అనుకుని - పాముగా మారి - అ ముని ఆశ్రమప్రాంతంలో పొంచి ఉన్నాడు.

ఒకనాడు - వినువీధిలో ఎగురుతున్న గద్ద ఆ పాముని చూసింది. పాము కంటపడడమేమిటి, మెరుపు వేగంతో దానిని కాళ్లతో చిక్కించుకుని ఎగిరి ఒక చెట్టుకొమ్మ మీద ఉంచి నానాహింసలూ పెట్టసాగింది. అదే చెట్టుకింద తాగవలసిన పాలుఉన్న గిన్నెను పట్టుకుని పరధ్యానంగా కూర్చున్న దీక్షితులుకి తన తలపైన చెట్టుకొమ్మ మీద జరుగుతున్న అలజడి తెలియడమేలేదు. అతని ఆలోచనలన్నీ భార్యమీద ఉన్నాయిమరి.

ఆ పాముని గద్ద జయించేసింది. తనకి ప్రాణాపాయం తప్పదని తేల్చుకున్న పాము విషం కక్కేసింది. నురుగులాటి ఆ విషం నారాయణ



ఆకాశంనుండి దీక్షితుని పాత్రలో పడుతున్న పాము విషం.



దీక్షితుల చేతిలో ఉన్న గిన్నెలోని పాలలోపడింది. ఐతే దీక్షితులు - భార్యతలపులలో ఉండి - అదికూడా గమనించలేదు.

చెట్టుకొమ్మమీద - పాముని చంపి తినేసింది గద్ద. నారాయణ దీక్షితులు గిన్నెలోని పాలను తాగాడు. అంతే మరుక్షణం మరణించాడు - ఆ పాలలో కాలకూట విషప్రభావానికి".

అంతవరకూ చెప్పి ప్రశ్నలు సంధించాడు భేతాళుడు. "మహారాజా! నారాయణ దీక్షితులు బ్రాహ్మణుడు. అతనిది సహజమరణం కాదు. ఒక విధంగా హత్యే. కనుక అతన్ని చంపిన వారికి బ్రహ్మహత్యాపాతకం అంటక తప్పదు. జాగ్రత్తగా నిర్ణయించి చెప్పు. ఆ బ్రహ్మహత్యాపాతకం ఎవరిది? పాముదా? గద్దదా?'' ఆ ప్రశ్నలకు విక్రమార్కుడు. - "గద్ద ది నిమిత్తమాత్రమయిన పాత్రే యీ సంఘటనలో. గంధర్వుడు మొదటినుంచీ అపరాధే. పరస్త్రీని మోహించడం.. ఆమెనపహరించడం, చెరపట్టడం, ఆమె భర్తను చంపాలని ప్రయత్నించడం... అన్నీ నేరాలే. అతన్ని చంపడానికే గంధర్వుడు పాముగా మారాడు కదా. చివరకి నారాయణ దీక్షితుల మరణానికి కారణం కూడా ఆ పామువిషమే. కనుక నిస్సందేహంగా ఆ బ్రహ్మహత్యాపాతకం పామురూపం దాల్చిన గంధర్వుడిదే'' అని వక్కాణించాడు. ఆ విధంగా విక్రమార్కుడి మౌనం చెదరిపోవడంతో - శవం మాయమైంది.

## అసలు తండ్రి ఎవరు?

జయంతీనగరంలో తిలోత్తమ అను పేరుకల స్త్రీ ఉండేది. ఆమెకు బాల్యమందే వివాహం జరిగింది. (పూర్వకాలంలో చిన్నప్పుడే పెళ్లి చేసేసేవారు ఆడపిల్లలకి). కాని... భర్తవలన ఎటువంటి సంసారసుఖమూ అనుభవించ కుండానే ఆమెకు వైధవ్యం ప్రాప్తించింది. (అంటే - భర్తచనిపోయాడని. బాల్య వివాహాలవలన కలిగే అనేక నష్టాలలో యిదొకటి) వితంతువుకు అన్నీ అంక్షలే' అలా మొదలుపెట్టాడు భేతాళకథని.

విక్రమార్కుడు తలమీదున్న శవాన్ని గట్టిగా పట్టుకుని వినసాగాడు.

"వైధవ్యమంటే వచ్చిందికాని ఆమెకి వృద్ధాప్యం రాలేదు కదా? యౌవనంలో ఉంది. అందగత్తె. కోరికలు ఊరికే పోవు మరి. అందుచేత తిలోత్తమ విధవయినా ఒక మగవానికి మనసిచ్చి అతనితో రహస్యంగా సుఖ భోగాలనుభవిస్తూండేది. ప్రకృతికి - స్త్రీ అనే తప్ప ఆమె విధవా (భర్తలేనిదా) సధవా (భర్తకలదా) అనే తారతమ్యం ఉండదు కనుక ఆమె గర్భవతయింది. భర్తలేని స్త్రీ గర్భవతయితే ఆక్షేపణ కనుక తన రహస్యం బయటకు పొక్కకుండా ఆమె ఎక్కడికోపోయి.. బిడ్డ కలిగాక తనవూరికి తిరిగివస్తూ - మధ్యతోవలో ఆ మగబిడ్డను వదిలేసి వచ్చింది.

ఆ బిడ్డ ఒక శ్రీమంతుడి కంటపడ్డాడు. అతనికి సంతానంలేదు. అందుచేత ఆ మగపిల్లవాడిని తన యింటికి తీసుకుపోయి - దత్తత చేసుకుని.. ఆ అబ్బాయిని పెంచి పెద్దచేసి తన ఆస్తులన్నిటినీ యిచ్చాడు. ఆ కుర్రవాడికతను పెంపుడు తండ్రనే తెలియదు. కొంతకాలానికి అతను మరణించాడు. కొడుకు - తండ్రికి చేయవలసిన అపరకర్మలు (చనిపోయిన వారికి చేసే కర్మలు) చేస్తూ...పిండిప్రదానాలూ తర్పణాలూ (ఆహారమూ, నీరూ) వదులుతూంటే - పితృలోకం (చనిపోయిన పెద్దలు పితృలోకంలో ఉంటారని నమ్మకం) నుంచి అతని ముందు మూడు చేతులు చాచబడ్డాయి.

మొదటిచేయి - తిలోత్తమను వివాహం చేసుకున్న వాడిది. రెండవది - తిలోత్తమకు గర్భం ప్రసాదించిన రహస్య ప్రియుడిది. (అతనూ చనిపోయాడదివరకే)

మూడో చెయ్యి - అతన్ని దత్తత చేసుకుని పెంచి పెద్దవానిని చేసి ఆస్తిపాస్తులనిచ్చిన పెంపుడు తండ్రిది.

రాజా! ఇప్పుడా కుమారుడు - ఆ ముగ్గురి చేతులలోనూ ఎవరి చేతిలో పిండం ఉంచాలో, తర్పణం వదలాలో చెప్పు" అన్నాడు భేతాళుడు.

ఒక్క నిముషమయినా ఆలోచించలేదు విక్రమార్కుడు. "పిండప్రదానాలూ,





సంబంధించినవి కనుక యీ సమస్యను హిందూధర్మ శాస్త్రాలననుసరించి పరిష్కరించడమే యుక్తం. తిలోత్తమ విధవ అయినదే తప్ప భర్తనుండి విడాకులు పొందలేదు. కనుక ఆమెను పెళ్లి చేసుకున్నవాడే భర్త. ఆమె రహస్యంగా ప్రియుడితో సంబంధం ఏర్పరచుకుందే తప్ప అతన్ని వివాహం చేసుకోలేదు. కనుక ఆ పిల్లవాడి జన్మకు కారకుడయినా అతనా పిల్లవాడికి తండ్రి కాజాలడు. వివాహమాడిన భర్తదే సంతానమౌతుంది. ఐతే- దత్తతవలన కన్నతండ్రికి పుత్రుని వలన పొందే ఉత్తర క్రియాధికారాలు పోతాయి. అతను వాటిని వదులుకునే దత్తత యివ్వాలి. దత్తత తీసుకున్న తండ్రికే పుత్రుడినుంచి ఉత్తర క్రియలకు అందుకునే అధికారం సంక్రమిస్తుంది. కనక అతని దత్తత తండ్రిచేతియందే పిండప్రదానమూ, తర్పణమూ చేయడం సముచితమూ, ధర్మసమ్మతమూ." అని తీర్మానించాడు విక్రమాదిత్యుడు.

"సెహభాష్" అంటూనే అంతర్థానమయ్యాడు శవమూ, దానిలోని భేతాళుడూ. విక్రమాదిత్యుడికి మళ్లీ మౌనం భగ్నమయింది.

## వితంతువా, ముత్తయిదువా?

చంపానగరంలో కపిలుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతనికిద్దరు కొడుకులు. అన్నదమ్ములిద్దరూ ఒకమ్మాయినే ప్రేమించారు. ఎవరికివారికే తానే ఆమెను పెళ్లాడాలనే పట్టుదల పెరిగిపోయింది. ఇద్దరూ ఆమె దగ్గరకు వెళ్లారు. ఆమె విషయం విన్నది. "మీరిట్లు పంతం పట్టడం భావ్యంకాదు. మీరిద్దరూ ఒక నిర్ణీత స్థలంనుంచి బయలుదేరి -నియమిత కాలంలో పరుగెత్తండి. ఎవరెక్కువ దూరం పరుగెడతారో వారినే నేను వరిస్తాను' అంది తానుకూడా ఎటూ తేల్చుకోలేక.

ఆ పందెంలో అన్నదమ్ములిద్దరూ సమానంగా వచ్చారు. అందుచేత సమస్య మళ్లీ మొదటికే వచ్చింది. అప్పుడు పెద్దలు కలుగజేసుకుని - సోదరులారా! మీరిద్దరూ ఆమెను పరిణయమాడండి. ఆరునెలలొకరూ,





ఆరునెలలింకొకరూ ఆమెతో కాపరం చేయండి. అంతకంటే మరో మార్గం మాకుతోచడంలేదు-" అన్నారు. వారి సలహా ప్రకారమే వీళ్లిద్దరూ ఆమెను పెళ్లిచేసుకుని సంసారం చేయసాగారు.

కొంతకాలానికి - ఆమె భర్తలలో పెద్దవాడు మరణించాడు. విక్రమార్కా! ఒక భర్త మరణించాడు కనుక ఆమె వితంతువై ఆ నియమాలు పాటించాలా? లేక భర్త సజీవంగానే ఉన్నాడు కనుక సుమంగళిగానే సుఖజీవితం సాగించాలా? సమాధానం తెలిసీ చెప్పకపోతే నీ తల వెయ్యి ముక్కలవుతుంది అని హెచ్చరించాడు భేతాళుడు. విక్రమార్కుడు కొంచెం ఆలోచించి -

"భేతాళా! పెద్దవాడినే అనుసరించి ఆమె వైధవ్యం అనుభవించాలి కాని అతనే తన వివాహకాలంలో ఆమె ఐదోతనంలో తమ్ముడికి భాగమూ స్థానమూ యిచ్చి వున్నాడు. చిన్నవాడింకా జీవించే ఉన్నాడు కనుక ఆమె ముత్తయిదువుగా ఉండుటయే ధర్మం" అని చెప్పాడు. భేతాళుడతని తెలివిని మెచ్చుకుని - మాయమైపోయాడు.

## మూర్ఖు

పూర్వము అమలాపురంలో హేమగుప్తుడనే వైశ్యుడుండేవాడు. అతడొక్కసారి వ్యాపారమునకై దూరదేశమునకు పోయి వచ్చుచుండగా దారిలో నలుగురు మనుషులొక పిల్లవాడిని చంపబోతూంటే చూసి "కారణమేమిటి" అని అడిగాడు.

"ఇతని తండ్రి మాకు వేయివరహాలు బాకీ. అతను చనిపోయాడు. ఆ బాకీ యితను చెల్లించవలసియున్ననూ చెల్లించుట లేదు. అందుకని యితనిని చంపుచున్నాము" అన్నారు వాళ్లు. "ఆ సొమ్మును నేనిచ్చెదను. ఇతనిని వదిలిపెట్టండి'' అంటూ వారికి డబ్బిచ్చేసి - ఆ కుర్రవాడికెవరూలేరంటే - తన వెంట తీసుకొచ్చి ఆశ్రయం కలిగించాడు. ఇలాగ సుబుద్ధి అతని యిల్లు చేరిన కొన్నాళ్లకే ఆ వైశ్యుడికి కొడుకు పుట్టాడు.

అతని పేరు సమబుద్ధి.

అంతకు కొన్నేళ్ల ముందు అమలాపురం, పరిసరగ్రామాల మీద ఒక రాక్షసుడు పడి చిక్కినవారందరినీ చూసి తినేస్తూంటే - ఆ గ్రామస్తులందరూ అక్కడ పంచాయితీ జరిపి - రోజూ ఒక గ్రామంనుంచి ఒక మనిషిని పంపేందుకూ, రాక్షసుడు మిగిలినవారి జోలికి రాకుండానూ ఒక ఒడంబడిక,(అంగీకారం.. అగ్రిమెంటు) చేసుకున్నారు.

ఆ వేళ రాక్షసుడికి ఆహారంగా మనిషిని పంపవలసిన వంతు హేమగుప్తునికి వచ్చింది. చేయగలిగేదేమీలేక అతను తన కొడుకు సమబుద్ధిని వెళ్లమన్నాడు రాక్షసునికాహారంగా. ఐతే హేమగుప్తునికి తెలియకుండా సమబుద్ధితోపాటు సుబుద్ధికూడా వెళ్లాడు.

"మీరు యిద్దరెందుకు వచ్చారు?" అడిగాడు రాక్షసుడు.

"అయ్యా! మేము వరుసకు సోదరులం. నేను వీడి తండ్రికి జన్మించక పోయినా- వీరు నా కొకప్పుడు ప్రాణదానం చేశారు. అంతేకాదు. నన్ను చేరదీసి కుటుంబ సభ్యుడిని చేసుకుని యిన్నాళ్ళూ నన్ను చక్కగా పెంచుతూ పోషిస్తున్నారు. వారి రుణం తీర్చుకుందుకు నాకిది చక్కని అవకాశం. వారి కుటుంబాన్ని నిలపడానికి నా ప్రాణాన్నివ్వడం నాకు ధర్మమూ, విధీకూడా. కనుక తమరు సమబుద్ధిని విడచిపెట్టి నన్ను తిని మీ ఆకలి తీర్చుకోండి" అని వినయంగా ప్రార్థించాడు. అంతలో సమబుద్ధి ముందుకొచ్చి - "అయ్యా! ఏ సుముహూర్తాన సుబుద్ధి మా యింటికి వచ్చెనో మరి, మా తండ్రిగారికన్నియూ శుభములే జరిగినవి. పుత్రోదయం కూడా అయినది. మా తండ్రిగారికితడనిన అమితమయిన ప్రేమ. ఇతడు అన్నగా నేను తమ్ముడిగా ఎంతో అభిమానంతో పెరిగాము. అది అలా వుంచండి. నా బదులు వీనిని మిమ్మల్ని తిననిచ్చినచో మా తండ్రిగారు రక్షించినవానిని - నేను భక్షించినట్లే అగును. అలా జరిగితే నేను మా తండ్రికింత ద్రోహం చేసినట్లే ఔతుంది. అందుచేత తమరటువంటి ప్రమాదమూ పొరపాటూ




రాక్షసునికి ఆహారంగా వెళ్ళిన సుబుద్ధి, సమబుద్ధులు

జరగనివ్వక-నన్నే భక్షించి సుబుద్ధిని వదలివేయుడు" అని కన్నీటితో వేడుకున్నాడు.

ఆ పిల్లల మాటలకు రాక్షసుడి మనసు కరిగిపోయింది. వాళ్ల మీద జాలితో పాటు అతని బుద్ధి కూడా వికసించింది. తన తప్పు తెలిసి వచ్చింది. మనసు మారిపోయింది. "మీలో ఒకరినే కాదు. ఇకపై నేనెవరినీ తినను" అన్నాడు. వాళ్లనింటికి వెళ్లిపొమ్మన్నాడు.

"విక్రమార్కా! ఆ వైశ్యబాలురు సుబుద్ధి, సమబుద్ధులలో ఎవరు గొప్పవారు? సూటిగా అడిగాడు భేతాళుడు.

"నిజానికి మనం చెప్పుకోవలసింది - మంచివాడిగా మారిన రాక్షసుడి గురించే. ఎందుకంటే సుబుద్ధి, సమబుద్ధులకు మొదటినుంచీ సంస్కారము ఉంది, జ్ఞానమూ ఉంది. కాని - రాక్షసుడు మంచివాడిగా మారడమే గొప్ప" అన్నాడు విక్రమార్కుడు. అతను మాటలాడడంతో-భేతాళుడదృశ్యమయి పోయాడు.

## ఎవరితో కాపరం చెయ్యాలి?

విక్రమార్కా! పూర్వం ఒక కోటీశ్వరుడుండేవాడు. అతనిది విదేశాలతో వ్యాపారం. అందుచేత తరచుగా ఓడ ప్రయాణం చేస్తూ యితర ద్వీపాలకు వెళ్తూండేవాడు. ఆ రోజులలో ఓడ ప్రయాణమంటే ప్రమాదాలతో కూడుకున్నది. సముద్రం మీద దారి తప్పిపోవడం... తుఫానులకు ఓడలు పగిలి ప్రయాణికులు సముద్రంలో పడిపోయి మరణించడం.. దొంగల భయం... యిలాటివెన్నో జరిగేవి. అందుచేత - ఎటుపోయి ఎటు వస్తుందో అన్న భయంతో - అతను చాలా ప్రేమించే భార్యపేర కొంత ఆస్తిని దాన, విక్రయ (దానం చేయడానికి, అమ్మడానికీ) అధికారాలన్నిటితోనూ రాసియిచ్చాడు. అంతేకాదు.
నేను మూడు మాసములలో వస్తాను." అని చెప్పి ప్రయాణమయ్యాడు.

భర్త చెప్పిన గడువు దాటి ఆరుమాసాలయినా అతను తిరిగి





రాకపోవడంతో అతని భార్యకిదుశంకించి - మరొకరిని వివాహం చేసుకుంది. కొత్త భర్తతో ఆమె మూడు మాసాలు కాపరం చేశాక వ్యాపారి తిరిగివచ్చాడు. అతనికి భార్యంటే ప్రాణమే. ఆమెకీ అతనంటే ప్రేమే.

విక్రమార్కా! ఇప్పుడామె ఎవరితో కాపరం చేయాలి? ఎవరిని కాదనాలి?" అని ప్రశ్నించాడు భేతాళుడు. విక్రమార్కుడు అట్టే ఆలోచించకుండానే - "పునర్వివాహం జరగడంతోటే పూర్వవివాహం రద్దయిపోతుంది కనుక వ్యాపారికామె మీద హక్కుండదు, కాని - వారిద్దరికీ యిష్టమయినచో అమె వారిరువురితోనూ కాపరం చెయ్యవచ్చు" అన్నాడు.

మౌనభంగంకావడంతో శవమూ దానిలోని భేతాళుడూ అదృశ్య మయ్యారు.

## ధర్మం ధర్మమే

ఒకప్పుడు వంగరాజ్యంలో దొంగల బెడద చాలా ఎక్కువగా ఉండేది. ఆ చోరులను పట్టుకోడాని కెన్నివిధాల ప్రయత్నించినా సఫలం కాలేదు. చివరకు రాజుగారే స్వయంగా ఆ దొంగలని పట్టుకుందుకు రంగంలోకి దిగాడు. రాత్రివేళ మారువేషం ధరించి రాజధానిలో తిరుగుతూండేవాడు. ఒకనాడతనికి దొంగల ముఠా కనపించింది. కాని.. తనొక్కడు వారనేకమంది. అంతేకాక- వీరినేకాక దొంగలందరినీ పట్టుకోవాలి కదా? అందుకని - వారిని సమీపించి - "అయ్యలారా! నేనొక దొంగల ముఠాలో ఉండేవాడిని. రాజుగారు నన్ను బంధించి కారాగారంలో ఉంచగా నేనెలాగో తప్పించుకుని వస్తున్నాను. రాజభటులూ నన్ను వెంబడించు చున్నారు. మీరు నాకాశ్రయమిచ్చి కాపాడండి." అని ప్రార్థించాడు. ఆ దొంగలు మారువేషంలో ఉన్న రాజును దొంగగానే భావించి తమ నివాసానికి తీసుకుపోయారు. రాజు జాగ్రత్తగా ఆ మార్గములను ప్రాంతాన్నీ గమనిస్తూ గుర్తుపెట్టుకుని మర్నాడు వారినుంచి తప్పించుకునివచ్చి - సేనలతో పోయి ఆ దొంగలందరినీ పట్టుకున్నాడు. అంతవరకూ వారు దొంగిలించి దాచుకున్న బంగారం, వెండి ధనము మొదలయిన వానినన్నింటినీ పేదసాదలకు

మారువేషంలో దొంగలను వెంటాడుతున్న మహారాజు





పంచిపెట్టి ఆ దొంగలకు ఉరిశిక్ష విధించాడు.

రాజభటులు ఆ దొంగల నాయకుని ఉరికంబమెక్కించబోతూండగా ఒక పెద్దమనిషి పరుగు పరుగున వచ్చాడు.

"రాజా! నాకు లేకలేక ఒక్క పుత్రిక కలిగింది. ఆమె ఒకనిని వరించింది. అతనిని తప్ప అన్యులను వివాహమాడనని నిశ్చయించుకున్నది. అతను - మీరు ఉరి తీయబోతున్నవాడే మీరాతనిని ఉరితీసినచో నా అమ్మాయి తక్షణం ప్రాణత్యాగం చేయును. కనుక అతనిని క్షమించి వదలండి." అని ప్రార్థించాడు. కాని రాజతని ప్రార్థనను వినలేదు. రాజదండన అమలుపరచవలసిందే అని ఖచ్చితంగా చెప్పాడు. ఆ దొంగని ఉరితీయడమేమిటి, అతన్ని వరించిన కన్య కూడా మరణించింది. వారిరువురి కళేబరాలను ఒకే చితిమీద దహనం చేశారు. విక్రమార్కా! ఆ కన్య మరణించినందుకు పాపం రాజుదా కాదా?" అని అడిగాడు భేతాళుడు. "రాజు తన ధర్మమును చక్కగా పాటించాడు. ఉచితానుచితాలెరుగ కుండా దొంగను వరించుట కన్యదే పొరపాటు. ఆమె మరణమునకు రాజు బాధ్యత రవంతయినా లేదు. అతనికేవిధమయిన పాపమూ అంటదు. -" అని చెప్పాడు విక్రమార్కుడు. అతనికి మౌనభంగం కావడంతో శవంతో సహా భేతాళుడదృశ్యమైపోయాడు.

## అపాత్రదానం

విక్రమార్కా! నీకు పుండరీకుడి కథ చెబుతాను. శ్రద్ధగావిను-" అంటూ మొదలు పెట్టాడు భేతాళుడు. విక్రమార్కుడు చెప్పమనీ అనలేదు. భేతాళుడి వద్ద యిలాటి కథలు యిరవయ్యయిదున్నట్లు అంచనా. వాటన్నిటికీ తను జవాబులు చెప్పగలిగితే మంచిదే. లేదా.. తనకి నిజంగా సమాధానం తెలియని చిక్కు ప్రశ్న అతనడిగినా సరే. అప్పుడు తను మౌనంగా ఉండిపోవచ్చు. సమాధానం తెలిసి చెప్పకపోతే కదా బుర్ర వెయ్యి

ముక్కలయ్యేది?" తెలియక మౌనంగా ఉండిపోతే బాధవేయదా?

"శ్యామలాపురంలో పుండరీకుడనే యువకుడుండేవాడు. అతను చాలా ధనవంతుడు. విలాస ప్రియుడు. భోగలాలసుడై జీవిస్తూంటే కొందరు దొంగలతని ధనమునంతయు దొంగిలించి అతన్ని చావగొట్టి నదిలో పారేశారు. అతను నదిలో కొట్టుకుపోతూంటే ఒక ముని చూసి బయటకు తీయించి సపర్యలు చేకూర్చి అతని ప్రాణాలు కాపాడాడు. తరవాత అతని కథంతా విన్నాడు. ఆ మునికి అతని మీద దయకలిగింది. తపోదీక్ష ప్రసాదించాలనిపించింది కానీ - 'ప్రస్తుతం యితనికి తపస్సువంటివి తగవు, ఇతని మనసు కామభోగములందే కొట్టుమిట్టాడుతోంది. కొన్నాళ్లిలాగే గడపనీ' ' అని తన తపోబలంతో - దగ్గరలోనే మేడలు, పూలతోటలు, కొలనులు, సౌందర్యవతులు, ధన, ధాన్య వస్తు, వాహన సముదాయాన్ని సృష్టించి పుండరీకుడికి యిచ్చాడు. వాటిని కొద్దికాలం అనుభవించాక - పుండరీకునికి వాటితో తనివి తీరలేదు. గురువుగారి వద్ద నున్న విద్యలన్నింటినీ సంపాదించినచో యింతకంటే ఎక్కువగా ఐశ్వర్య సుఖాలనుభవించ వచ్చుకదా అనే దురాశతో తనకా మంత్రాలన్నింటినీ నేర్పమని మునిదగ్గర పట్టుపట్టాడు. అప్పుడు ఆ ముని మెల్లగా యిలా చెప్పాడు. - "నాయనా పుండరీకా! కామభోగములనుండి మనసు విముక్తి చెందిన కాని యీ మంత్రములు పనికిరావు. ఈ మంత్రములు నేర్చుకునే తరుణం ముందుంది. సమయం కాని సమయంలో యిలాటి మంత్రాలు నేర్చుకోవడం అత్యంత ప్రమాదకరం"

కాని పుండరీకుడు ముని హితవును వినక - "వెంటనే నేర్పండి" అని మొండికెత్తాడు. చివరికాగురువుగారు అతన్ని నిలవరించలేక - అతి రహస్యాలయిన మంత్రాలను పుండరీకుడికుపదేశం చేశారు. అంతే - కామ, క్రోధ,లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గంలో ఏ ఒక్క దుర్గుణాన్నీ





జయించని పుండరీకుడు - హృదయం నిర్మలం కాకుండా పఠించడంతో ఆ మంత్రాలలో ఎన్నో పొరపాట్లు దొర్లాయి. మంత్ర పఠనంలోని దోషాలవల్ల అతని చుట్టూ అంతవరకూ ఉన్న సుందరాంగులందరూ దెయ్యాలయి పోయారు. ఆ మేడలూ, ఉద్యానవనాలూ స్మశానాలయి పోయాయి. దెయ్యాలయిన అందగత్తెలతనిని మింగేశాయి. పుండరీకుడు మరణించాడు.

రాజా! నేరం ఎవరిది? ఆగురువుదా? పుండరీకుడిదా? నిర్ణయించి తెలియచెప్పు" "భేతాళా! పుండరీకుడు చిన్నవాడు. కామలోలుడు అతనికా వయసులో యుక్తాయుక్తాలు తెలియకపోవడం సహజమే., కాని... పెద్దవాడు, సర్వమూ తెలిసిన వాడూ అయిన ముని అలాటి అమూల్యమయిన మంత్రాలను అనర్హుడయిన వానికి ఉపదేశించడం తప్పు. దేనినీ అపాత్రదానం చేయకూడదు కదా? కనుక - నేరం గురువుదే" సమాధానమిచ్చాడు రాజు. అతను మౌనం వదిలి మాట్లాడడంతో - శవం అదృశ్యమయిపోయింది.

## స్నేహం

"తక్షశిల విశ్వవిద్యాలయం చాలా ప్రసిద్ధి చెందింది. దానిలో- వసుదేవుడు, మహాదేవుడు అనే యిద్దరు విద్యార్థులు చాలా కాలంగా ప్రాణస్నేహితులయి మెలగుతుండేవారు. నేర్చుకోదగిన విద్యలు నేర్చుకోవడం పూర్తయింది. ఇళ్లకి వెళ్లిపోవు సమయం వచ్చింది. అప్పుడు వసుదేవుడు "మిత్రమా! మనమిన్నాళ్ళుగా స్నేహంతో మెలగుతూ వస్తున్నాం, కారణాంతరాల వల్ల నువ్వు నా వివాహానికి రాలేక పోయావు. ఇప్పుడేనా ఒకసారి మా వూరు వచ్చి మా యింటి యందొకటి రెండు దినాలయినా గడుపు-" అని మహాదేవుడిని కోరాడు. అతనుస్నేహితుడ్ని కాదనలేక అతనితో వాళ్ల గ్రామం వెళ్లాడు. "తర్వాత నువ్వు మా వూరు రావాలి" అని కోరి ఊరుచేరిన మర్నాడు వసుదేవ మహాదేవులు సరదాగా కబుర్లు చెప్పుకుంటూ బజారు వీధిలో నడస్తూంటే - మహాదేవుడొక అమ్మాయిని చూసి

మదనతాపంతో మంచం పట్టేశాడు. అది ఎన్ని వైద్యాలకీ తగ్గకపోగా వసుదేవుడు మహదేవుని - "నీ బాధేమిటి?" అని తరచి తరచి అడిగాడు. మహదేవుడు ప్రాణమిత్రుడికి తన మదన తాపాన్ని వెల్లడించాడు. ఆమె గుర్తులు చెప్పాడు.

వసుదేవుడు రహస్యముగా ఆమె యింటికి వెళ్లి - ఆమెను కలుసుకుని - "రుక్మిణీ! నా మిత్రుడికి నీ యందు మోహము కలిగింది. నిన్ను పొందకున్న అతను జీవింపడు. నువ్వతనికేమీ చెప్పకు. నా మాట నిలబెట్టు. నా ప్రాణ మిత్రుడిని కాపాడు.-" అని ఆమెను ప్రార్థించినంత పని చేసి- అమెనొప్పించాడు. రాత్రి సమయంలో దొడ్డితోవన రహస్యంగా మహదేవుణ్నామె వద్దకు పంపాడు.

మహదేవుడు మహదానందంతో ఆమె గదిలో కూర్చుని ఆమెతో మాట్లాడుతున్నాడు. తన కోరిక నెరవేరుతుందన్న సంతోషంతో ఉన్న అతనికి - హఠాత్తుగా ఒక చిత్రం కనిపించింది. దానిలో - వసుదేవుడూ, రుక్మిణీ. వివాహసందర్భంగా తీయించుకున్న చిత్రం...

మహదేవుడికి మతిపోయింది. "అయ్యో ఎంత పొరపాటు చేశాను!' ' మహదేవుడు తెగ విచారించాడు. "వసుదేవుడు రుక్మిణీ భార్యాభర్తలని ఎరగక ఎంత మహాపాపం చేశాను-'' అని దుఃఖిస్తూ ప్రాయశ్చిత్తం చేసుకుందుకన్నట్లు - మేడమెట్ల ప్రక్కనున్న బావిలో పడిపోయాడు. మహదేవుడు బావిలో కురకడం గమనించిన రుక్మిణి - "నాపై ఎంతో నమ్మకంతో నా భర్త అప్పగించిన పనినెరవేర్చలేకపోయాను. వారి ప్రాణమిత్రుడిని కాపాడలేకపోయాను. వారికి నా మొహం ఎలా చూబెట్టేది? నేను బతికుండడం దేనికి?" అనుకుంటూ ఆమె కూడా ఆ బావిలోకే దుమికి మరణించింది.

చెప్పినట్లు తెల్లవారుఝామున మిత్రుడు తిరిగి రాకపోవడంతో వసుదేవుడు తనే ఆ యింటికి వచ్చాడు. మేడమీద గదిలో రుక్మిణికాని





మహదేవుడు కాని కనపడకపోవడంతో వారిని వెదకుతూ...బావిలో పడి ఉండడం గమనించి తాను కూడా ఆ బావిలోకి ఉరికి ప్రాణాలు వదిలాడు.

"మహారాజా! ఆ ముగ్గురి చావులకి ఎవరు అసలు కారణం? మిత్రుడి భార్యపై మనసుపడిన మహదేవుడా? నిజం చెప్పకుండా అతన్ని తన భార్య వద్దకంపిన వసుదేవుడా? భర్తకోరినంత మాత్రాన అనుచితమయిన కార్యమునకు సిద్ధపడిన రుక్మిణా?"

"వీరెవరూకారు. అసలు కారణం విధి. అంతా విధి నిర్ణయమే తప్ప మరొకటికాదు" అన్నాడు విక్రమార్కుడు. అతను పెదవి విప్పడంతో శవం అంతార్థానమయిపోయింది.

## స్వభావం

ఒక శూద్రునకు నలుగురు పుత్రులు. అతను చనిపోయేముందు కొడుకులని పిలిచి-"తూర్పు ఇంటి అడ్డగోడకింద నాలుగువేల వరహాలు దాచాను. నా అనంతరం సమంగా పంచుకోండి." అని చెప్పి కన్నుమూశాడు.

వారిలో ఒకడు మిగిలిన వారికి తెలియకుండా ఆ సొమ్ము అపహరించాడు. కొంతకాలానికి సొదరులు ఆ ధనాన్ని పంచకోవాలని అక్కడ వెదికితే లేదు. దాంతో -నువ్వుతీశావంటే నువ్వుతీశావని కేకలు వేసుకుని రాజసభకు వచ్చి తగవు తీర్చమనిరి. "కొంతకాలమాగిరండి" అని రాజువారిని పంపివేశాడు. కొన్నాళ్లయ్యాక మళ్లీ ఆ నలుగురు అన్నదమ్ములూ రాజసభకు వచ్చారు.

"ఒకరాజు కొక కుమార్తె ఉండేది. ఆమెకు గురువుచే సమస్తవిద్యలూ నేర్పించాడు. ఆమె గురువుగారికి దక్షిణనీయబోయి బంగారుపళ్లెమునందు

వస్త్రములు, నగలు మొదలయినివి పెట్టి తీసుకువెళ్లగా - 'నాకివి అక్కరలేదు.' అన్నాడు గురువు. రాకుమార్తె "మరేంకావాలి" అని అడగగా - నీవివాహం రేపనగా అప్పుడుకోరుతాను. అన్నాడు. ఆమె "అలాగే" అని వెళ్లిపోయింది. రాకుమారికి వివాహదినం వచ్చింది. ముందురోజు గురువుకి సమాచారం పంపగా "శోభనం రాత్రి నీభర్తతో కలిసే ముందు సకలాభరణభూషితవైరా' ' అని వర్తమానం పంపాడు. గుణవతి అయిన ఆ రాకుమారి వాగ్దానాన్ని నిలుపుకుందుకు శోభనంనాటి రాత్రి అలంకారభూషితయై గురువు వద్దకు వెళ్తూండగా దారిలో దొంగలడ్డగించారు.

చోరులారా! నేనొకచోటుకి పోవుచున్నాను. త్వరగానే తిరిగి వచ్చెదను. నగలన్నీ అప్పుడు మీకిచ్చేస్తాను. నన్నుమాట నిలబెట్టుకోనివ్వండి "అని కోరగా వారంగీకరించి ఆమెను అప్పుడు పోనిచ్చారు. ఆమెగురువును దర్శించుకోగా నీభర్తతో కూడి కలకాలం సుఖంగా ఉండు-" అని ఆశీర్వదించి సెలవిచ్చేశారు. ఆమెతిరిగి వస్తూ దొంగలను తననగలను తీసికొనమనగా- "ఆడి తప్పని నీవంటి గుణవతి వద్ద చౌర్యము చేయుటకు మా మనసంగీకరించడం లేదు- నీ భర్తతో సుఖంగా ఉండు" అని వారు ఆమెను సాగనంపారు. ఆమె- జరిగినదంతయూ భర్తకు చెప్పింది. అతనెంతో ఆనందించి కొంతకాలం తరువాత ఆమెను తన రాజ్యానికి తీసుకు వెళ్లిపోయాడు.

అంతవరకూ చెప్పిరాజు ఆనలుగురి సోదరులనీ - "వీరిలో అధికులయిన గుణవంతులెవరు? రాజకుమారా? దొంగలా? రాజకుమారి భర్తా? గురువా?' ' అని ప్రశ్నించాడు. "శోభనపు పెళ్లికూతురిని పరపురుషుడి వద్దకు పంపిన -భర్త" అన్నాడు పెద్దవాడు. "ఆడితప్పని రాజపుత్రికి -"చెప్పాడు రెండోవాడు. "అంత సౌందర్యవతి అయిన కన్యవచ్చినా -మరో చింత చేయక - ఆశీర్వదించి పంపిన గురువు" -అన్నాడు మూడోవాడు. "చేజిక్కిన నగలను దోచుకొనక ఆమెను వదలివేసిన దొంగలు-అన్నాడు నాలుగోవాడు.





వారిసమాధానాలను బట్టి దొంగెవరో గ్రహించినా -కొన్నాళ్ళాగాక చిన్నవాడిని పిలిచి-"నువ్వే దొంగవి సాక్ష్యాధారాలు కూడాలభించాయి" అని రాజు గద్దించగా వాడు అంగీకరించి -అన్నదమ్ములవాటాలిచ్చేశాడు.

"విక్రమార్కా! ఆ నలుగురిలోనూ నిజంగా గుణాధికులెవరు? ప్రశ్నించాడు భేతాళుడు. ఇలాంటి విషయాన్నే పరిష్కరించిన రాజు - "రాజకుమారే. వాగ్దానాన్ని నిలుపుకుందుకామె చేసినంత సాహసం తక్కువదికాదు. ఆమె దాంపత్యానికే ముప్పు తేగలిగిన ఆపాయన్నెదుర్కుందామె ఆడినమాట కోసం " అని చెప్పడంతో భేతాళుడు మాయమయ్యాడు.

## ఎవరు గుణవంతులు ?

"పూర్వం వేదపారాయణుడి కుమార్తె వివేకవతితో బాల్యం నుండి కలసి చదువుకున్న అనురాగుడు అను యువకుడు ఒకనాడామెను సమీపించి- "వివేకవతీ! నాకు నీవన్న ఎంతయో ప్రేమ. ఎలాగేనా నువ్వు నా వాంఛ తీర్చాలి" అని ప్రాధేయపడ్డాడు. అందుకామె-"అనురాగా! నా తండ్రినన్నికొకనికిచ్చి వివాహం చేయబోతున్నాడు. వివాహం జరిగిన వెంటనే నా భర్త అనుమతి తీసుకుని ముందుగా నిన్నే ఆనందింపజేస్తాను." అంది.

వివేకవతికి కొద్దిరోజులలోనే వివాహం జరిగింది. శోభనం నిర్ణయించబడింది. శోభనగదిలో తనకోసం ఆత్రంగా నిరీక్షిస్తున్న భర్తపాదాలకు భక్తితో నమస్కరించి- స్వామి విధివశాత్తు నేను ఒక యువకునికి తొలిపొందు నిచ్చెదనని వాగ్దానం చేసితిని. దయచేసి నాకతనిని తృప్తిపరచి వచ్చుటకనుమతి ప్రసాదించాలి. అని ప్రార్థించింది. ఆ భర్త ఒక్కసారి ఆలోచనలోపడ్డాడు. అంతగా అవసరమయితే-మగవాడనే కనుక తను మరో వివాహం చేసుకొనవచ్చు కదా అనుకుని -"సరే వెళ్ళు"అని అనుమతించాడు.

వివేకవతి వేగంగా అనురాగుని వద్దకు వెళ్ళింది. "అనురాగా! ఆనాడు నీకు చేసిన వాగ్దానమును చెల్లించవచ్చితిని-"అంది.

శోభనపు పెళ్లికూతురి దుస్తులలో ..అలంకరణలో ఉన్న వివేకవతిని చూస్తూ అతను నిశ్చేష్టుడే అయ్యాడు. ఇచ్చిన మాటకోసం-ఆమెయిలా రావడం అతనికాశ్చర్యం కలిగింది. ఆమె ఔన్నత్యమూ తననైచ్యమూ అర్ధమయ్యాయి. అతనిలో వివేకం మేలుకొంది. ఎంతో పశ్చాత్తాపంతో- "అమ్మా నువ్వు నాకనులు తెరిపించావు. నీవంటి స్త్రీని కాని నీ భర్తవంటి పురుషోత్తముడుకాని అతి అరుదు" అంటూ ఆమెకు నమస్కరించి - ఆమెను వెంటబెట్టుకొని శోభనపు పెళ్లికొడుకు వద్దకు వెళ్లాడు.

వివేకవతి-జరిగినదంతా భర్తకు తెలిపింది. అనురాగుడు అతన్ని తన తప్పు క్షమాపణ కోరాడు. వివేకవతి భర్త వారిని సరిగా అర్థం చేసుకున్నాడు. భార్యయందెటువంటి సంశయముకాని భేదభావముకాని లేకుండా ఆమెతో అనురాగంతో కాపరం చేయసాగాడు. "అంతవరకూ కథచెప్పి అప్పుడు తన ప్రశ్నలను సంధించసాగాడు భేతాళుడు. "రాజా! అనురాగునకిచ్చిన మాట నిలబెట్టుకున్న వివేకవతి. ఆమె వాగ్దానము నిలబెట్టుకొనుటకు ఆమోదము తెలిపిన ఆమె భర్త. సరైన సమయంలో తన తప్పు తెలుసుకొని వివేకవతి వంటి సౌందర్యవతి పొందును త్యాగం చేసుకుంటూ ఆమెను మాతృమూర్తిగా భావించిన అనురాగుడు- వీరు ముగ్గురిలో ఎవరు ఎక్కువ గుణవంతులు?

వారు ముగ్గురూ గుణవంతులే ఏభార్యా కోరరాని కోరిక కోరినా వివేకవతిని ఆమె వాగ్దానం నిలుపుకొనుటకు ఆంగీకరించడం-అతని గుణవిశేషాన్ని సూచిస్తుంది. సర్వాలంకార భూషితయిన తానెన్నడో మనసుపడిన వివేకవతి చేరవచ్చినా- అప్పటి పరిస్థితి నవగాహాన చేసుకుని ఆమెను తల్లిగా పరిగణించిన అనురాగుడు, వాగ్దానమును నిలబెట్టుకుందుకు ప్రయత్నించిన వివేకవతి- ఎవరికి వారే ఆదర్శప్రాయులు. అని - విక్రమార్కుడు చెప్పగానే భేతాళుడు అదృశ్యమయ్యాడు.





# చోరుడు - రత్నావతి కథ

మధురానగరమందు వీరకేశుడనే వర్తకుడుండేవాడు. అతనికి రత్నావతియని కూతురు ఉండేది. ఆమె జగదేకసౌందర్యరాశి. ఆమెను వివాహమాడ వలెనని ఎంతోమంది ప్రయత్నించి విఫలులైనారు.

ఒకసారి పట్టణములో దొంగతనాలు విపరీతంగా జరుగజొచ్చాయి. దొంగల బెడద ఎక్కువైంది. ప్రజలందరవా రాజువద్దకు వచ్చి మొరపెట్టుకున్నారు. ఎంత ప్రయత్నించిననూ దొంగలజాడ తెలియకపోవుటచే రాజు స్వయముగ తానే దొంగలను పట్టుకొనుటకు బయలుదేరాడు.

ఒకనాటి అర్ధరాత్రి సమయమున ఒక భయంకరాకారమును జూచి' ' "ఎవరు నువ్వు" యని రాజు ప్రశ్నించాడు. "నేనీ గ్రామదేవత మహంకాళి కొడుకుపోతురాజును'' అని చెప్పింది. ఇతడే దొంగలరాజు అబద్ధమాడుతున్నాడని రాజు గ్రహించి "ఓహో! అట్లయిన మా గ్రామదేవత మమ్ములను కాపాడుతున్నట్లు మీరు కూడా మా గ్రామాన్ని రక్షించుచుండవలె' 'నన్నాడు. అట్లేనన్నాడు దొంగల నాయకుడు.

"ఈ రాజుగారు నన్ను పోతురాజని నమ్ముతున్నారు" అనుకొని ఆయన నమ్మకము వమ్ము చేయక,తమ పని సులువు అవుతుందని తలచి "రాజా యిక పదండి, చాలా కాలాతీతమయింది. విశ్రమిద్దురుగాని" అని రాజాంతఃపురమున కేగి బయట దొంగలతో తన ముఠాతో వేచియున్నాడు. కాని రాజిదియంతయు పసిగట్టి ఒక్కమారుగా తన భటులతో ఆ దొంగల ముఠాపై బడి వారిని బంధించాడు.

దొంగలనాయకుడికి శిరశ్ఛేదము గావింపుమని శిక్ష విధించి వెడలి పోయాడు. మరునాడు పోతురాజును వధ్యశిలకు కొనిపోయేటపుడు వీరకేశుని పుత్రిక, జగదేకసౌందర్యవతియైన రత్నావతి ఆతనిని జూచి అతనే తనకు తగిన భర్తయని నెంచి ఆతనితో నాకు వివాహం జరిపించనిచో

ప్రాణత్యాగమొనర్తునని తండ్రికి విన్నవించినది. తండ్రి ఎంత నచ్చజెప్పిననూ వినలేదు.

చేసేదిలేక వీరకేశుడు రాజునాశ్రయించి వృత్తాంతమెరిగించి దొంగను క్షమించి విడువమని ప్రార్థించెను. రాజందులకు అంగీకరింపక మరునాడే శిక్ష అమలుజరుగవలెనని ఆజ్ఞ జారీచేశాడు.

## విక్రమార్కుడు వరాహమును చంపుట

ఒక గ్రామంలో ఒక వరాహము కనిపించిన వారందరినీ ఢీకొని కొమ్ముతో పొడిచి, గాయపరచి అల్లకల్లోలమొనరించుచుండెను. గ్రామస్థులీ విషయమును విక్రమార్క మహారాజుకి విన్నవించారు.

విక్రమార్కుడు అశ్వాన్నధిరోహించి దానిని వేటాడబోయాడు. అది చాలా దూరముపోయి కొండలోనున్న ఒక బిలమున ప్రవేశించింది. రాజును గుహయందు ప్రవేశించి అందు పట్టపగలులాంటి వెలుతురుండుట గమనించి మరికొంతలోనికి బోవ ఒక పెద్ద భవంతి కనపడెను. లోనికి తొంగిచూడగానొక బ్రహ్మరాక్షసి తన భయంకరాకారముతోనుండుటయు, కొందరు భృత్యరాక్షసులు సేవించుటయు అగుపడెను.

రాజు గుహంతర్భాగముననున్న రాక్షసుని చూచాడు. ఆ రాక్షసుడు "ఓ రాజా! నిన్ను చూడవలెననే తలంపుతో నేనీ క్రూరకృత్యములు చేశాము. నీ దర్శనం లభించింది. ధన్యుడను. నా అపరాధములు మన్నింపుము" అని వేడికొన్నాడు. సకల వస్తువస్త్రాభరణాలు కానుకగా రాజుకు సమర్పించాడు.

ఆతనిని పాతాళలోకమునకు తోడ్కొనిపోయి అమృతకలశముల నర్పించి పంపివేసెను. రాజు దిరిగివచ్చి.... ఒక విప్రకుమారుడు కుష్ఠురోగ బాధాపీడితుడై యుండుట గమనించి, తను తెచ్చిన అమృతకళశములనాతని కందించి ఆతనిని స్వస్థుని చేసెను. వరాహము వలన పాడైన గ్రామమునంతను తను తెచ్చిన అమృతముతో మరల జీవించేటట్లు చేసి ఆ





విక్రమార్కుడు అశ్వాన్నధిరోహించి దానిని వేటాడబోయాడు. అది చాలా దూరముపోయి కొండలోనున్న ఒక బిలమున ప్రవేశించింది. రాజును గుహయందు ప్రవేశించి అందు పట్టపగలులాంటి వెలుతురుండుట గమనించి మరికొంతలోనికి బోవ ఒక పెద్ద భవంతి కనపడెను. లోనికి తొంగిచూడగానొక బ్రహ్మరాక్షసి తన భయంకరాకారముతోనుండుటయు, కొందరు భృత్యరాక్షసులు సేవించుటయు అగుపడెను.

రాజు గుహంతర్భాగముననున్న రాక్షసుని చూచాడు. ఆ రాక్షసుడు "ఓ రాజా! నిన్ను చూడవలెననే తలంపుతో నేనీ క్రూరకృత్యములు చేశాము. నీ దర్శనం లభించింది. ధన్యుడను. నా అపరాధములు మన్నింపుము" అని వేడికొన్నాడు. సకల వస్తువస్త్రాభరణాలు కానుకగా రాజుకు సమర్పించాడు.

ఆతనిని పాతాళలోకమునకు తోడ్కొనిపోయి అమృతకలశముల నర్పించి పంపివేసెను. రాజు దిరిగివచ్చి.... ఒక విప్రకుమారుడు కుష్ఠురోగ బాధాపీడితుడై యుండుట గమనించి, తను తెచ్చిన అమృతకళశములనాతని కందించి ఆతనిని స్వస్థుని చేసెను. వరాహము వలన పాడైన గ్రామమునంతను తను తెచ్చిన అమృతముతో మరల జీవించేటట్లు చేసి ఆ
పురమునకు పూర్వవైభవం కల్పించి తన పురంబున కరిగె. అట్టిదాన వితరణశీలి మన విక్రమార్క మహారాజు. వెనుదిరిగాడు భోజరాజు యథాప్రకారం.

## వరుసక్రమము - బంధుత్వము

విక్రమార్కా! పూర్వమొకగ్రామంలో ఒక రైతుండేవాడు. ఆతడు మిక్కిలి సహాయ స్వభావము కలవాడు. మంచివాడు. ఎవరికే ఆపద వచ్చిననూ ఆదుకొనేవాడు. కొన్ని కుటుంబముల వారాతని యింటియందు నివసించేవారు. ఆతని కొక్కడే కుమారుడు.

రైతొకనాడు పొలములో సేద్యము చేయుచు పనులు వత్తిడివలన మధ్యాహ్నం భోజనానికి రాజాలక పోయెను. పొలమునకే భోజనము పంపుడని తనవారినాదేశించెను. మధ్యాహ్న సమయానికి అత్తాకోడండ్రిద్దరూ ఆహారమును తీసుకొని పొలమునకు పోయారు. తండ్రి కొడుకులు పనియందు నిమగ్నులై వారి రాకను గమనించి కాళ్ళు కడిగికొని వచ్చి కూర్చొన్నారు. అత్తాకోడండ్రిద్దరూ ఎవరి తండ్రికి వారాహారము బెట్టి వెనుదిరిగారు. 'ఓ విక్రమార్క మహారాజా! వీరిద్దరూ తండ్రికొడుకులు. వారిద్దరూ అత్తాకోడండ్రు. వీరి బంధుత్వమెట్టిదియో యోచించి చెప్పుము'అని కోరాడు.

విక్రమార్కుడు చిఱునవ్వు నవ్వి "భేతాళా! ఆ రైతుకు కొడుకుకంటె పెద్దదైన కూతురు ఉంది. బావమరిదికే తన కూతురునిచ్చి పెండ్లి చేశారు. ఆ కూతురునకు పుట్టిన కూతురు అనగా మనుమరాలు తన కుమారునకు మేనకోడలు అవుతుంది. వారిద్దరికీ వివాహం జరుగుటచే ఆ మేనత్త కోడండ్రు రైతుకుమార్తెయు రైతు ముదిమనవరాండ్రు ఇరువురును అహారమునుగైకొని ఎవరి తండ్రికివారు అన్నము పెట్టుటలో ఔచిత్యమేమున్నది. ఈ విధముగా చెప్పినంతలో భేతాళుడు అంతర్ధానమయ్యాడు.

## పామర పండితులు

పూర్వము హరిహరపురమనే పట్టణమునందు వేదాంతి వరదయ్య, సిద్ధాంతి సిద్ధయ్యయనే యిరువురు భక్తులున్నారు. వారిలో నొకడు వరదయ్య విష్ణుభక్తుడు వీనికి శివభక్తులనిన అమితద్వేషము. రెండోవాడు సిద్ధయ్య శివభక్తుడు ఈతనికి విష్ణుభక్తులనిన అసహ్యము. అందుచే ఎవరికి వారు తమ తమ దైవములనే గొప్పవారిగా ప్రచారముగావించుకొని యితర దైవాల్ని దూషించేవారు.

వారిరువురూ వారి వారి యిష్టదైవముల పట్ల అమితభక్తి కలవారు. సాటిలేని నియమనిష్ఠలతో పూజలు చేసేవారు కఠిన నియమాలు, ఉపవాస





దీక్షలు మున్నగు పూజలందుకొనే వారు ఒకరిని మించిన వారింకొకరు, వారిద్దరూ ఎదురు పడితే తమతమ దైవములను గూర్చి వాదించుకునే సమయాల్లో చండప్రచండులై చూచేవారికి భీతిగొల్పుతూ ఉండేవారు. వారిద్దరూ ఒకరి నొకరు చంపవలెనని ప్రయత్నములు సల్పుతూ బ్రాహ్మణ హత్యలు చేసీ ముఠాలు రెండింటిని చేరదీసి వారికి కావలసినంత ధనము నిచ్చి ప్రోత్సహించేవారు. కాని వారి పాపకర్మఫలమున వారిద్దరూ ఆయా ముఠాల చేతుల్లోనే తనువులు చాలించారు. వారిద్దరూ పోయిన పిదప ఆ పట్టణమంతా మతకలహాలు, కక్షలు లేక సుఖముగానుంది.

మరణించిన భక్తులిద్దరూ యమసదనానికేగారు. యమ ధర్మరాజు దారి దుష్కృత్యములను విచారించి "మీరెంత మాత్రము నరకలోకాన ఉండుటకు వీలులేదు. తక్షణమే పొండి" యని వెడలగొట్టాడు. తరువాత వారు వైకుంఠసదనానికేగారు. నారాయణ భటులు గూడా వారిని విచారించి "మీ రెంత మాత్రం యిక్కడుంటానికి వీలులేదు. దూరము పొండి" యని గెంటేశారు. ఏం జెయ్యటాన్కి పాలుబోక ఎక్కడి కెళ్ళాలో దెలియక మదనపడుతుండగా దైవము వారిద్దరిని దయ్యములుగా జేసి గెంటివేసింది. వారిద్దరూ దయ్యాలై ప్రజలను పీడించుచుండగా భూతవైద్యులు వారిని బంధించారు. ఈ విధముగా వారు నానాహింసలకు గురికాబడ్డారు.

"ఓ విక్రమార్క మహారాజా! వారిద్దరూ ప్రజ్ఞా వంతులైయుండి, శక్తిగలవారయ్యున్ను మీదు మిక్కిలి సదాచారభక్తి సంపన్నులైయుండి గూడా ఎందుకు ఈ దుర్గతిని పాల్పడ్డారు. వివరించమని" జెప్పగా విక్రమార్కుడిట్లు జెప్పదొడంగెను.

"భేతాళా! సహనములేని ప్రజ్ఞ, శక్తి, భక్తి, జ్ఞానసంపన్నులన్నియు ఎంత ఉన్నను నిష్ప్రయోజనమే, వరదయ్య, సిద్ధయ్యలిద్దరు మహాభక్తులే

కాని జ్ఞాన శూన్యులు. పరమత ద్వేషం కలవారు. ఎంతటి వారికిని పరమత ద్వేషము, పరులను నిందించుట, కుల ద్వేషములు పనికి రావు. ఇవి సమాజమును భ్రష్టపట్టించున"ని జెప్పగా భేతాళుడు నిజస్థానమునకు పోయెను.

పూర్వము ఒక వృక్షముపై అనేక పక్షులు తమ తేనితో జీవించుచున్నాయి. విక్రమార్కుడు భూసంచారము చేయుచు ఆ వృక్షచ్ఛాయను విశ్రమించుచున్న రాత్రి, పక్షులన్నియు గుమిగూడి కొలువు దీరియున్నాయి. "పక్షులారా! మనకిక్కడ శత్రుబాధ ఎక్కువగా యుంది. మన ప్రాణాలకు రక్షణ కనిపించుటలేదు. యింతకంటె మంచి సురక్షితస్థానమును చూచిరమ్మన్నాను చూచివచ్చితిరా?'యని పక్షులతేడు అడిగాడు. "ప్రభూ! ఎక్కడ చూచినను ఏదియో యొక్క ఇక్కట్టు కనిపించుచునే యున్నది. కాని యుజ్జయిని నగరంబునట్లుగాదు. దాని పాలకుడు విక్రమాదిత్యుడు. అక్కడి జంతువులలో జాతి వైరములు, కులమత ద్వేషాలు, జారచోర బాధలు. అప మృత్యుభయము మొదలైవేవీలేవు. ఆ రాజు దైవ సమానుడు. పరోపకారపారీణుడు. దయాస్వభావుడు, మీదు మిక్కిలి జీవుల యెడ కరుణా స్వభావుడు. ఆతని రాజ్యములోనే ప్రాణానికెప్పుడునూ కీడు కలుగదు. మనమా ప్రాంతమున వసింపవచ్చును"నని పక్షులన్నియు ముక్త కంఠముతో చెప్పాయి. 'సరే'నని అంగీకారానికొచ్చాయి.

జంతుభాష నెఱింగిన విక్రమార్కుడిదంతయూ విన్నాడు. ఆదమరచి నిద్రిస్తుండగా తెల్లవారురఘామున ఎక్కడనుండియో నొక యావునుదరుముకొని ఒక పులి వచ్చుటయునుగాంచెను. గోవునూ విక్రమార్కుని శరణుజొచ్చినది. ఆతడునూ పులిని తన భయంకర ఖడ్గముచే చంపివేసెను. యిదంతయు వృక్షము నుండి గమనించుచున్న పక్షులు జూచి





ఈతడెవరని విచారించి యడిగి దెలిసికొని "ప్రభూ! పులిని జంపి పాడియావును గాపాడితివి. మమ్ములను గూడా రక్షించి మాన్యుడవు కమ్ము మమ్ములనొక రాక్షసుడు ప్రతిదినము భక్షించి పోవుచున్నాడు. మా వంశమంతరించి పోవుచున్నది. మమ్ము రక్షించి మా బాధలీడేర్చు"మని ప్రాధేయపడ్డాయి. విక్రమార్కుడు వాటికభయము నొసంగి యారాక్షసుడున్న ప్రదేశమునకరిగి ఆతనితో యుద్ధము జేసి యా రాక్షసుని సంహరించి, వధించిన వార్తను పక్షులకెఱింగించి "నిర్భయముగా నివసించండ"ని జెప్పి తన స్వస్థలమునకు పోయాడు. విక్రమార్కుని ఔదార్యమునకు కరుణా స్వభావతకు, జంతుప్రేమకు ఈ కథయే నిదర్శనము.

## ఏమని పిలవాలి?

'తండ్రి-కొడుకు" వరసయ్యే యిద్దరు కాశీకి వెళ్తున్నారు, కాలినడకన. వెళ్తున్నవీరికి తమముందు ఎవరో వెళ్లినట్టు రెండు జతల అడుగుల జాడలు కనిపించాయి.

"ఈ పాదముద్రలు నిస్సందేహముగా స్త్రీలవే." అన్నాడు కొడుకు.

"వారిలో ఒకరు వయసులో కొంచెం పెద్ద రెండోది చిన్నది" చెప్పాడు తండ్రి. "ఔను. ఒక జత పాదముద్రలు పెద్దవిగా ఉన్నాయి -మరి" "ఆ పెద్ద పాదాల పెద్దదాన్ని నేను చేసుకుంటాను - అన్నాడు తండ్రి. "ఆ చిన్న పాదాల చిన్నదాన్ని నేను చేసుకుంటాను" అన్నాడు కొడుకు- తండ్రి ఆమాటెప్పుడంటాడా అని ఎదురు చూస్తున్నట్లు. "సరే. వేగంగా నడు వాళ్లని కలుసుకుందాం. వాళ్ల పాదముద్రలు పడి ఆట్టే సేపవలేదు కనుక వాళ్లు మరీ దూరంపోయి ఉండరు-" ఇద్దరూ గబగబనడవసాగారు. తొందరలోనే వారాస్త్రీలను కలుసుకోగలిగారు. "మీలో పెద్దపాదముల కలదానిని నేనూ, చిన్నపాదములు కలదానిని నా కొడుకూ వివాహం చేసుకుందామని మేము

కోరుకున్నాం. మీకంగీకారమే కదా అడిగాడు తండ్రి. "ఆ" అన్నారు ఆ స్త్రీలు. అప్పుడు బయటపడింది విచిత్రమయిన వాస్తవం. పెద్దపాదాలు కలది కూతురు చిన్న పాదాలు కలది తల్లి. అయినా సరే తాము ముందుగా అనుకున్న మాట తిరగకుండా - పెద్దపాదాలు కల చిన్నదాన్ని తండ్రి, చిన్నపాదాలు కల పెద్దదాన్ని కొడుకు వివాహం చేసుకున్నారు.

రాజా! ఆతండ్రీ కొడుకులకు పుట్టిన పిల్లలిద్దరు ఏ వరుసతో పిలుచుకోవాలి? "అడిగాడు భేతాళుడు. విక్రమార్కుడు నోరు విప్పకుండా శవాన్ని మోసుకు వెళ్లసాగాడు. తండ్రీ కొడుకులు మరొక తల్లీ కూతుళ్లను వివాహం చేసుకోడమన్నదే రాజుకి అసంగతమని తోచిందేమో. అది- జవాబుకి అర్థమయిన ప్రశ్నే కాదనిపించిందో? నీతి బాహ్యంగా ఉందనిపించిందో .. అతను పెదవి విప్పలేదు. అయినా అతనికి ఆపదా సంభవించనూలేదు.

అప్పుడు భేతుళుడిలా అన్నాడు. "విక్రమార్కా! నేనెంతమంది రాజులనో చూసితిని కాని నీవంటి ధైర్యసాహసములు కలవారినినెవరినీ చూడలేదు. నీవు నా ప్రశ్నలన్నిటికీ ఓపికగా చక్కగా సమాధానాలు చెప్పావు. కనుక నీకక మేలు చేయాలనుకుంటున్నాను, విను. నువ్వు నన్ను ఏసన్యాసి వద్దకు తీసుకెళ్తున్నావో అతడు ఒకశక్తికి పూజలు చేస్తున్నాడు. ఆక్షుద్రపూజకు - సకలగుణములు కలిగిన క్షత్రియునికాని సమస్త యోగజ్ఞానియగు సన్యాసిని కాని ఎవరు పూజాసమయంలో బలియిస్తారో వానికి నన్ను వశపరతునని శక్తివాగ్దానము చేసింది. అందుకంగీకరించి సన్యాసి నిన్ను మోసగించి యిలా తెచ్చి నిన్నా శక్తికి బలియివ్వబోతున్నాడు. అందుకే నన్ను తేవడానికి నిన్ను నియమించాడు. ఏమి జరుగబోతున్నదో తెలుసా? విక్రమార్కుడు మౌనం వదలలేదు. భేతాళుడే మళ్లీ చెప్పసాగాడు. "రాజా! నువ్వు నన్నక్కడికి




విగ్రహంముందు మాంత్రికుని చంపబోతున్న విక్రమార్కుడు.

చేరుస్తావు. అతను నిన్ను దేవిముందు సాష్టాంగప్రణామం చేయమంటాడు. ఆభంగిమలో ఉండగా నిన్ను బలిద్దామని. కాని ... రాజా! నువ్వప్పుడు - నాకొకరిచే మొక్కించుకొనుటయేకాని నేను మరియొకరికి మొక్కుట ఎరుగను, కనుక అది ఎటులో మొక్కిచూపుము అను. అప్పుడు సన్యాసి శక్తిముందు మొక్కుతూ సాగిలపడతాడు. ఆ సన్యాసి సామాన్యుడు కాడు. అఖిలలోక సంపన్నుడు. అందుచేత నువ్వు నీ చేతికత్తితో వాని తలనరికి వేయి. అప్పుడు శక్తి తన కోరికను నీవు చెల్లించావు. కనుక - నీ ధైర్యమునకు మెచ్చుకుని నన్ను నీకు వశం చేస్తుంది-" అని చెప్పాడు.

విక్రమార్కుడు భేతాళునితో కూడిన శవాన్ని సన్యాసి ముందుంచాడు.

"వేగంగా ఆ కొలనులో స్నానం చేసి పవిత్రుడివయిరా" అని సన్యాసి చెప్పగానే స్నానం చేసి వచ్చాడు. "శక్తికి మొక్కు-" అన్నాడు సన్యాసి.

"ఎలా మొక్కాలో తమరు చేసి చూపించండి-" అన్నాడు రాజు అతివినయంగా. "ఇలా" అంటూ సన్యాసి దేవి ముందు సాష్టాంగ దండప్రణామం చేశాడు. తక్షణం విక్రమార్కుడు చంద్రాయుధమనే తన కత్తితో అతని తల నరికాడు.

శక్తి ప్రత్యక్షమయింది. విక్రమార్కుడి సాహసానికి మెచ్చుకుని - భేతాళున్ని అతనికి వశపరచింది.

'రాజా! ఇకనుంచి నేను నీ పరమయ్యాను. నువ్వెప్పుడు నన్ను తలుచుకుంటే అప్పుడు నేను నీముందు వాలుతాను. నాకు ప్రస్తుతం శలవివ్వు' అన్నాడు. శలవిచ్చి విక్రమార్కుడు ఉజ్జయిని చేరుకున్నాడు.